# ★ సమాలోచన ★

✱ జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక ✱

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J College, Rajahmundry.


## ✱ వార్షిక సంచిక ✱

## పారిజాతము

— శ్రీ డాక్టరు గిరాకర్ల వెంకటావధాని

నందితిమ్మన పారిజాతాపహరణమున నారదుడు పారిజాతప్రసూనమును వర్ణించు సందర్భమున

పరిమళము చెడదు, వాడదు,
పరువము తప్పదు పరాగభర భరితంబై
నిరతము జగదేక మనో
హరమగు నీకుసుమరాజ మంబుజవదనా!

అను పద్యమును వ్రాసియుండెను. పారిజాతము పుష్పములలోని కెల్ల శ్రేష్ఠమైనది. ఇతర పుష్పములకు దానికిని, చాల వ్యత్యాసము కలదు. ఇతర పుష్పములు కొన్ని దినములకు వాసన కోల్పోవును వాడిపోవును పరిపాకమును (మార్దవమును) వీడును పరాగహీనములై విసర్జనీయములగును. పారిజాతకుసుమ మట్లు కాదు. దాని సౌరభ మెన్నటికి చెడదు. అది వాడిపోదు, క్రొత్తదనమును వీడదు, అధికమైన పుప్పొడితోకూడి జగత్తునకు నిత్యహృద్యమై యలరారును. తిమ్మన యీపద్యమును తనకావ్యమును కూడ దృష్టిలో నుంచుకొని వ్రాసెనేమో ననిపించును. దానికూడ పారిజాతకుసుమమున కున్న లక్షణము లన్నియు నుండునని అతడు భావించి యుండవచ్చును. ఈ మహాకావ్యమిప్పటికి సహృదయ హృదయానంద సంధాయకమై నిత్యనూతనమై యలరారుచుండును. అట్టి సారస్వతమునందది యుత్కృష్ట ఉదాత్త కావ్యము. (Classic)

సంస్కృతమున వెనుకటి వైదికవాఙ్మయము తరువాత లౌకిక వాఙ్మయము ...యుత్పైదలెను లౌకిక సంస్కృతమునందు వాల్మీకి ఆదికవి. అతని రామాయణము ఆదికావ్యము తరువాత భారతము, పురాణములు, మహాకావ్యములు నాటకములు రచింపబడెను. వీని నన్నిటిని ఆంగ్లమున (Classical Literature) ప్రాచీనోదాత్త వాఙ్మయ మనిచెప్పుదురు. అది పరువము తప్పక యెన్నిమార్లు చదివినను విసువుకల్పింపక సారస్వత రసికుల సంతోషానందములను చూఱలిచ్చుచుండును అందు కందలి ప్రాచీనతయే కాక ధన్యగుణసంపదయు కారణము

ఆంగ్లమున classic అను పదమునకు సర్వజనీనమైన సద్గుణసంపదకలది, ప్రమాణభూతమైనది, ప్రథమశ్రేణికి చెందినది, ప్రాచీనమైన గ్రీకు, లాటిను కళాసంస్కృతి పారస్వతములకు సంబంధించినది, ప్రౌఢమైన శైలిలో వ్రాయబడినది, మహాకావ్య లక్షణాలంకృతమైనది. అను అర్థములు కలవు. పైని పేర్కొనబడిన సంస్కృతరామాయణ భారతాదులన్నిటియందు ఈలక్షణములు కనిపించును అవి ఆవాఙ్మయ మున్నంతకాలము పూజనీయములై కవిపండితుల గౌరవాదరములను పొందుచుండును

ఆంధ్రమున నన్నయాది మహాకవులు రచించిన గ్రంథములన్నియు classics అను నామమునకు తగియుండును. అవి భావమందును, భాషయందును, ప్రౌఢిమయందును సాటిలేనివై యలరారుచుండును. తిమ్మన పారిజాతమునకు చెప్పిన గుణములన్నియు వానియందు గోచరించును. వానియందలి భావసౌరభ మెప్పటికిని తగ్గదు, వానికి ప్రాతతనములేదు. అవి 'పురాతనములు.' వానియందలి అర్థగౌరవ మనితర సామాన్యమై సర్వాంధ్రజన మనోహరమై యొప్పారును.

ఇటీవల కొందఱు యువకులకు ప్రాచీన మహాకావ్యములపై గౌరవము సన్నగిల్లుటయే కాక వైముఖ్యము కూడ కానిపించుచున్నది. నవ్యత ప్రీతికరము, సంతోషావహము కావచ్చును. కాని ఉదాత్తత నిరసింపదగినది కాదు. దానిని నిరసించుట అశక్తిని సూచించును. ప్రాచీనకావ్యములు ఆంధ్రకవితా సౌధమునకు పునాదు లని చెప్పదగిన పవిత్ర గ్రంథములు. పూర్వకవులందఱును విద్వత్కవులు వారికి సంస్కృతాంధ్రములు కరతలామలకములు. భావవ్యక్తీకరణమునందును, జాతీయ పదప్రయోగమునందును వారప్రతిమానులు భాషా పాటవమును, వ్యక్తీకరణలాఘవమును, పదప్రయోగౌచిత్యమును అలవఱచుకొనుట కైనను వానిని పఠింపవలసిన అవశ్యకత యున్నది.

పరిమళమ్ము చెడక, పరువమ్ము తప్పక,
వాడిపోవకుండ, వ్యాసపద్య
భాసమాన రూపమై 'సమాలోచన'
పరిత్ప హృద్యమగుచు పరగుగాక.

— .. —

# 2. విదూషకపాత్ర - స్వరూప స్వభావాలు

భాషాప్రవీణ, సాహిత్యశిరోమణి శ్రీ నూరం శ్రీనివాసులు ఎం. ఏ.

సంస్కృత రూపకాలలో ఉదాత్త హాస్యపోషణ లేదనే అపఖ్యాతి లోకంలో ప్రబలియున్నా, కన్పించినంతలో ప్రసిద్ధి చెందిన హాస్య పాత్రలలో విదూషకు డొకడు. హాస్యం ఆయాభావాలకు సన్నివేశాలకు కాక ఆరూపకాలలో కొన్ని పాత్రలకు మాత్రం పరిమితమైన కారణంగా హాస్యపాత్ర లనవలసి వస్తోంది. విదూషకుడు, విటుడు, శకారుడు, చేటుడు చేటి మొదలగు పాత్రలు హాస్యరస నిష్యందనమే పరమప్రయోజనంగా ఏర్పడినవి. వాటియందును అత్యంత ప్రధానమూ విశ్వవిస్తృతమూ అయిన పాత్ర విదూషక పాత్ర.

ఉపలభ్యమాన గీర్వాణరూపకాలలో భాసరూపకాలు అత్యంత ప్రాచీనా లని విమర్శకాంగీకృత విషయం. ఆరూపకాలలో సైతమీ విదూషకపాత్ర సర్వాంగసుందరంగా కన్పిస్తోంది. కాబట్టి సంస్కృత రూపకోత్పత్తివలె విదూషక పాత్రోత్పత్తి సైతం చర్చా విషయమే అవుతుంది. రూపక వికాసం వలె విదూషక వికాసం కూడా ఊహింప బడవలసి వదే. కానీ నాటక వికాస విషయంలో లభించినన్ని ఆధారాలు ఇందు లభింపవు. బొమ్మలాటలే నాటకాలకు మూల మనే అభిప్రాయాన్ని అంగీకరించితే అందు కనిపించే గంధోళిగాడు, కేతిగాడు మొదలగు పాత్రలు విదూషకపాత్ర మూలికాలన వలసివస్తుంది. కానీ అది యథార్థం కాక పోవచ్చు. విదూషకపాత్రలోని ఉదాత్తత ఆపాత్రలలో కన్పింపదు. కేవలం విదూషక పాత్రనే ఆధారం చేసికొని నాటకాలు మతప్రాతిపదికగా ఏర్పడినవనే వాదాన్ని ఒప్పుకొంటే ఆ 'మహావ్రతము' నందలి బ్రాహ్మణ వటువే విదూషకరూపాన్ని స్వీకరించా లనవలసి వస్తుంది. కానీ మతపరమైన నాటకోత్పత్తి వాదమే నిరాధార మని తిరస్కరింపబడినది కదా. గ్రీకుప్రభావం వల్లనే గీర్వాణ రూపకోత్పత్తి అని అంగీకరించితే వారి Tragedy (ట్రాజెడీ) లోని కోరస్ కామెడీలోని కోర్టుఫూల్ (Court-fool) ను, ప్రాచ్యులు విదూషకుడుగా మలచుకొన్నా రనవలసి వస్తుంది. కానీ గ్రీకు ప్రభావ వాదంకూడా విమర్శకాంగీకృతం కాదు. ఇది (Stereo-type-character) మూసపోసిన పాత్ర. కాబట్టి దీని ఉత్పత్తి విషయమై ఆలోచింప వలసి వస్తోంది.

భాసుడు ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో తృతీయాంకంలో డిండికుడనే బ్రాహ్మణ వటువు వేషంలో_అది మారువేషం_విదూషకుని ప్రవేశ పెడతాడు. మహాసేనుడు బంధించిన ఉదయనుని విడిపించేందుకు పన్నిన వ్యూహంలో విదూషకుడు కూడా ఒకపాత్రధారి. ఒకగూఢచారి అతని వేషమే డిండిక బ్రాహ్మణ వటువేషం. కానీ అతడి ప్రవర్తన మామూలు విదూషకుని ప్రవర్తన వలెనే తిండిపోతుదనం మొదలగు లక్షణాలతో కన్పిస్తుంది. అతడు మారువేషం లోని వ్యక్తి కాబట్టి ఆలక్షణాలు డిండిక బ్రాహ్మణ వటు లక్షణాలే అనవలసి వస్తుంది అనగా ఆనాటి సమాజంలో 'డిండిక' బ్రాహ్మణ వటువులు హాస్యాస్పదులుగా ప్రకృత విదూషక లక్షణాలలోని మూలికతను మాత్రం ఆశ్రయించి యుండేవారేమో. వారిని బట్టి భాసుడు విదూషక పాత్రను తీర్చి యుండవచ్చు. ఇది చిన్న ఊహమాత్రం తగినంతగా ఆధారాలు ఏనిర్ణయానికీ లభించుట లేదు గదా!

అలంకార శాస్త్రానుసారం విదూషకుడు నాయక సహాయకులలో ఒకడు. పీఠమర్దుడు, విటుడు, చేటుడు విదూషకుడు, నాయక సహాయకులు. కాని ధనంజయుడు దశరూపకంలో చేటుని పరిహరించి, ముగ్గురని మాత్రమే పేర్కొన్నాడు. అయితే ఏ ఆలంకారికుడును విదూషకుని నాయక సహాయకుల జాబితా నుండి తొలగించలేదు. ఈ నాయక సహాయకులలో విదూషకునకున్న ప్రాధాన్యం ఇతరులకు లేదు. మిగిలిన ముగ్గురిలో ఎవ్వరునూ నాయకునికి నర్మసచివులూ అంతరంగిక మిత్రులూ కాలేరు. ఒక్క విదూషకునికే ఆఘనత దక్కింది. భరతుని అభిప్రాయానుసారం ఇతడు విప్రుడు. విప్రుడే కాక —

వామనో దన్తురః కుబ్జో
ద్విజిహ్వో వికృతాననః
ఖల్వాటః పింగళాక్షశ్చ
సవిధేయో విదూషకః ॥ 1

అని విదూషకుని ఆకారాన్ని వర్ణించాడు. పై వర్ణనను బట్టి ఆలోచించినచో విదూషకుడు ప్రథమ దృష్టితోనే నవ్వు తెప్పించేవాడుగా ఉండవలెనని భరతుని అభిప్రాయంగా కన్పిస్తుంది. భరతుడు, తద్వ్యాఖ్యాత అభినవుడూ ఇద్దరూ ఆహార్యానికంతో ప్రాధాన్య మిచ్చిన వారే. ఆప్రాధాన్యదృక్పథమే పై లక్షణంలో మనలను అలోకుంది. అతని ఆకారం అది అయితే బాధ్యత ఇది.

వికృతాంగ వచో వేషై
ర్హాస్యకారీ విదూషకః । 2

పై ఆహార్య బాధ్యతలను పరిశీలిస్తే అంగిక వికార, వచో వికార, వేష వికారాలతో హాస్యము నుత్పాదింపఁ జేసెడి వాడే విదూషకు డని స్పష్టమవుతోంది. పింగ ధూపాలుదే విదూషకలక్షణాలకు మరికొన్నింటిని నాయక సహాయక సామాన్య లక్షణాలలో వివరించారు. వాని ననుసరించి విదూషకుడు దేశకాలములను తెలిసినవాడు, భాషామాధుర్యం కలవాడు, విదగ్ధుడు, ప్రోత్సాహక [illegible]

లుడు, యుక్తి కర్తారి, నిశాధముంద్రక కలవాడునై యుండును. 3 ఈ లక్షణాలు చాలవరకు విదూషక పాత్రలో కన్పించెడివి. సాహిత్య దర్పణకర్త మతాన్ని అనుసరించి విదూషకుడు కర్మ వపుర్వేష భాషాదుల చేత హాస్యాన్ని కలిగించెడి వాడై కలహరతియై కన్పింపవలెను. అంతేగాక స్వకర్మజ్ఞత అనే విశేష లక్షణాన్ని కూడా విశ్వనాథుడు సమర్పించాడు. 4 సాగరనంది విదూషకుని నిర్వచించిన తీరు రమణీయమైనది

వయస్యక శ్చాటుపటుః
స ఏవ చ విదూషకః
అన్తఃపుర చరో రాజ్ఞాం
నర్మామాత్యః ప్రకీర్తితః 5

నాయక నర్మసచివుడూ, చాటు వాక్యాలనుపల్కుటలో నేర్పుగలవాడు, అన్తఃపుర చరుడు, వికృత వాగ్వేషకర్మ చేష్టాదులచే హాస్యాన్ని కల్గించెడివాడే విదూషకుడు. పై లక్షణాల నన్నింటిని పరిశీలించినపుడు 'వికృతి' విదూషక పాత్రలో ప్రధాన స్థానాన్ని వహిస్తుం దనుట నిస్సంశయం. బెర్గ్ సన్. (Bergson) ఆ వికారం ప్రధానమంటూ పలికే వాక్యాలను పరిశీలించండి.

**Three conditions are essential for the comic, the Character must be unsocialable, for that is enough to make him ludicrous, the spectator must be insensible to the character's condition, for laughter is incompatible with emotions, and the character must act automatically** [6]

అయితే నాటకకర్తలు ఈ 'వికృతి'ని మూలకంగా స్వీకరించి తమ తమ రూపకాలలో సురూపాన్ని వికృతులను కల్పించారు. అది కూడా సర్వరూపకాలలో గోచరించుచున్నది. కాబట్టి వాటిని కూడా విదూషక లక్షణాలుగానే స్వీకరించాలి. భోజనప్రియత, భీరుశీలత, అలంకారాభాషాల నుపయోగించుట, చేతులతో కలహములు తెచ్చుకొనుట, బుద్ధిహీనత, మోదకప్రియత మొదలగు నవి యీ లక్షణములు. అయితే ఈ లక్షణాలు అవ్యాప్తాలైన రూపకాలును లేకపోలేదు. అవిమారకం లోని సంతుష్టుడు భోజనైక దృష్టిగలవాడు కాడు. ప్రతిజ్ఞా యౌగంధరాయణంలోని వసంతకుడు భీరువు కాడు. మాలవికాగ్ని మిత్రంలోని విదూషకుడు బుద్ధిహీనుడు కాడు. అభిజ్ఞానశాకుంతలంలో కాళిదాసు విదూషకుని 'మృత్పిండ బుద్ధి' అన్నా, తన మాలవికాగ్నిమిత్రంలో మాత్రం అపార మేధాసంపన్నునిగానే చిత్రించాడు. రహస్యాన్ని దాచలేకపోవుట ఇతని ప్రత్యేకార్హణాలలో ఒకటి. అది చాలా ప్రమాదకరమైన గుణం. విక్రమోర్వశీయమ్, స్వప్నవాసవదత్తం, నలయూపట్, అభిజ్ఞానశాకుంతలమ్ మొదలగు అనేక రూపకాలలో ఆ లక్షణం కన్పిస్తుంది. అంతేగాదు. ఆ లక్షణానికి ప్రాధాన్యమిచ్చిన కాళిదాసు దుష్యన్తునిచే ఒక శ్లోకాన్ని-

క్వ వయం క్వ పరోక్ష మన్మథో
మృగశాబైస్సమ మేధితో జనః ।
పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః ॥ 7

ప్రత్యేకంగా పలికించి ధీరోదాత్తుని చేత ఆబద్ధాన్ని పలికించిన నిందను మోసినాడు. అయితే అనంగహర్షుని 'తాపస వత్సరాజనాటక' మీ లక్షణానికి విరుద్ధం. అందులోని విదూషకుడు మహామాత్యులతో సమానంగా తాను కూడా రహస్యాన్ని దాచి కార్యసాధనకు సహకరిస్తాడు. ఇతనికి వక్రదండం ఉంటుంది. బ్రహ్మ ఆ వక్రదండాన్ని ఇచ్చినట్లు భరతుడు నాట్యశాస్త్రంలో ప్రస్తావించాడు. కాని రూపకాలలో సామాన్యంగా వక్రదండకము ఆహార్యంలో వర్ణించినట్లు కనబడదు. నాయికలకు ఆహ్లాదాన్ని కల్గించుట విదూషక లక్షణాలలో ఒకటనుటకు అభినవగుప్తుడు తన అభినవ భారతిలో రెండుమార్లు సాక్ష్యం పలికినాడు. 'విదూషక హాస్యము సామాన్యముగా నాయికా హాస్యమును ఫలముగా భావించునని యెరుగుము.' 8 'ఆత్మగతము లయిన వికృతవేషాది విభావములచే విదూషకుడు తానే హాసము కలవాడగును. అది యాతని కాత్మస్థము. అతడు వానిచే పట్టపు దేవిని నవ్వించును. అది యామెకు పరస్థము' 9 ఈలక్షణాన్ని కాళిదాసు తనమాళవికాగ్నిమిత్రంలో సుస్పష్టంగా నిరూపించినాడు. స్వప్నవాసవదత్తంలో భాసుడును తన వసంతకునకు ఈ లక్షణాన్ని అనుగ్రహించినాడు. హాసకుడు, దుష్టుడు, దాస్యాఃపుత్రుడు మొదలగునవి ఇతని కభీష్టాలైన తిట్లు. ఇటువంటివి రామచంద్రుని నలవిలాసనాటకంలో అనేకాలు కన్పిస్తాయి.

విదూషకుని పేర్లు వినగానే ఉచ్చరించటానికి వీలుగా ఉంటాయి. 'వసంతకః కాటిలేయ ఇత్యాద్యోయో విదూషకః ॥10'

అని శింగభూపాలుడు మాదిరి చూపినాడు. భావప్రకాశకర్త శారదాతనయుడును.

నామాన్యస్య తు కేలిర్వా
మాధవ్య శ్చ వసంతకః ।
గాలవ శ్చే త్యేవమాది . ..'

అని విశ్వనాథుడును 'కుసుమ, వసంతాదు లతని పేర్లని ప్రకటించినాడు. దీనిని బట్టి వసంతర్తు, పుష్ప, గోత్రాదుల పేర్లితని పేర్లుగా వ్యవహరింపబడు ననుట సుస్పష్టము.' 11

విదూషక ప్రవేశం ప్రస్తావన యందే నియంతగా కన్పించవలె నని భరతుడు

అభిప్రాయపడినట్లు అధారా లున్నాయి. 'సర్వరంజక హాస్య ప్రధానమైన కావ్య విశేష మూపస్థాపించి'[12] నాటక ప్రదర్శన మారంభింపవలె నని అతని అభిప్రాయం. అంతేకాక ప్రస్తావనలో ముందుగా విదూషక హాస్యాన్నే కల్పించాలని ప్రతిపాదించాడు

విదూషక స్త్వేకపదాం
సూత్రధార స్మితావహామ్।
అసంబద్ధ కథాప్రాయాం
కుర్యాత్ కథనికాం తత ॥ 13

ఇట్లు విదూషకు డసంబద్ధ ప్రలాపాలు పలుకగా అపై సూత్రధారుడు కావ్య ప్రస్తావనను చేస్తాడు ప్రస్తావనలో ప్రరోచనకన్న ముందు త్రిగతాన్ని ప్రయోగించాలని, అది పారిపార్శ్వక సంజల్ప, విదూషక, విదూషణ, సూత్రధార స్థాపనలతో కూడియుండా లని భరతుని వక్కాణ[14] అంతేగాక నాయకుని ఇంద్రుడు రక్షించగా, నాయికను సరస్వతి, విదూషకుని ఓంకారం రక్షిస్తాయని భరతుడు వివరించాడు[15] అది విదూషకుని ప్రాముఖ్యాన్నే సూచిస్తోంది గదా! కనుక భరతుని అభిప్రాయంలో, ప్రస్తావన యందే నిలిచి, హాస్యాన్ని కల్గిస్తూ, ప్రేక్షకులను దర్శకోన్ముఖులను చేయుటయే విదూషక కర్తవ్యం. అయితే ప్రసిద్ధ నాటకకర్త లెవ్వరూ ఈనియమాన్ని పాటించినట్లు దాఖలాలు లేవు అక్కడ కూడ భగవదజ్జుకీయాది ప్రహసనాల్లో ఈ పద్ధతి దృగ్గోచర మవుతోంది.

విదూషక బాధ్యతలలో విశ్రాంతిజనకత్వం ప్రధానమైనది అదీ హాస్యంద్వారా 'Comic episods or interludes, usually in tragedy, are aimed to relieve the tension and highten the tragic element by contrast They are or should be an essential and integral Part of the whole work'[16] అని cuddon అభిప్రాయం. సంస్కృతంలో ట్రాజెడీ అని ప్రత్యేకించి చూపదగిన రూపకాలు లేకపోయినా ట్రాజెడీకి దగ్గరగా ఉన్నవీ, ఆ భావాలు కల్గినవీ చాలాకన్పిస్తాయి అయితే విషాదాత్మకత అన్నంతవరకే వాటికి ప్రాధాన్యం శృంగార ప్రధాన రూపకాలలో సైతం విప్రలంభశృంగారప్రాధాన్యం అత్యాహితం గదా! అదే ఆ రూపకాలలో విషాదాత్మకత అంతేగాక మృచ్ఛకటికమ్ చారుదత్తుని మరణంతో నాటకాన్ని ముగించితే ట్రాజెడీయే. ఉత్తరరామ చరితమ్, కుందమాలా, ప్రతిమా, తాపసవత్సరాజమ్ మొదలగు రూపకాలు విషాదపు పాళ్ళు ఎక్కువగా కలిగినవి అయితే భారతీయ విమర్శకులు సంపూర్ణంగా విషాదాత్మకాలని భావించిన ఉత్తరరామ చరితమ్, ప్రతిమా రూపకాలలో విదూషక ప్రవేశమే లేదు కాని అట్టి విషాదాత్మక రూపకాలేఅయిన కుందమాలా, తాపసవత్సరాజమ్ నాటకాలలో విదూషకపాత్ర దృగ్గోచర మవుతుంది. కనుక సాంద్రమైన కరుణలో Comic relief కు తద్వారా విదూషక పాత్రకు సంస్కృతరూపకకర్తలు స్థానాన్ని కల్పించక పోయినా, ఓపాటి కరుణలో విప్రలంభ శృంగారంలో విదూషక ప్రాధాన్యాన్ని కాదనలేదు మృచ్ఛకటికంలోని మైత్రేయుని, స్వప్నవాసవదత్తంలోని వసంతకుడు, అభిజ్ఞానశాకుంతలంలోని మాధవ్యుడు ఆరీతిగా స్థానాన్ని పొంది సహకరించినవారే. తాపసవత్సరాజమ్‌లోని వసంతకుడు, మాళవికాగ్నిమిత్రంలోని మాణవకుడు శక్తికిమించి కార్యభారాన్ని వహించినవారే అంతేకాక ఆనాటకాలలో ప్రథమాంకం ముగియగానే విదూషకుని ఏకోక్తి (Soloquy) తో ద్వితీయాంకం ప్రారంభమౌతుంది. అదికేవలం Comic relief దృష్టితో చేయబడినదే

నాయక భేదాల ననుసరించి విదూషక భేదాలను సైతం ఆలంకారికులు సూచించారు. ధీరోద్ధత, ధీరలలిత, ధీరోదాత్త, ధీర శాంతులకు క్రమంగా లింగి, ద్విజుడు, రాజజీవి, శిష్యుడు విదూషకులుగా వుంటారు. అనగా విదూషకుడు ఒకే వ్యక్తిత్వం కలవాడుగా కాక అనేక రూపాలు ధరించి వుంటాడు. తన నాయకుని స్వభావ మెట్టిదో దాని కనుగుణమైన స్వభావాన్ని ఆశ్రయించి హాస్య సృష్టి చేయగలిగి వుంటాడు, అయితే అనేక నాటకాలలో ఈ విభాగాన్ని అనుసరించి పాత్ర స్వీకారం జరిగినా వ్యక్తిత్వ పోషణలో సమాజస్థితి మాత్రమే కన్పిస్తుంది దానికి కారణం కవులే కాని, విదూషకుడు కాడు. తాపసవత్సరాజంలో మాత్రం ఇది చక్కగా కన్పిస్తుంది. ఉదయనుడు తాపసత్వాన్ని స్వీకరించినప్పుడు విదూషకుడునూ తాపసత్వాన్ని స్వీకరిస్తాడు అది స్వభావానుగుణత. ఆ ధీరశాంతునకు శిష్యుడు తగినవాడు. అయితే ఇతని లక్ష్యం హాస్యసృష్టియే కాబట్టి ఆతాపసత్వ స్వీకారంలో ప్రహసనత్వాన్ని ప్రకటిస్తాడు నాయక స్వభావానుగుణుడై హాస్యపోషణ చేయుట ఇట్టిదే భరతుండీ భేదాలనే దివ్య, నృప, అమాత్య, బ్రాహ్మణులకు, క్రమంగా లింగి, ద్విజ, రాజజీవి, శిష్యులు విదూషకులని ఉగ్గడించాడు.[17] శారదా తనయుని భావప్రకాశం వీరి లక్షణాలను సుస్పష్టంగా తెలియ జేస్తుంది.

దేవతల విదూషకుడు సత్యవాది, త్రికాల వేది కృత్యాకృత్య విశేషవేత్త, ఊహాపోహ విశారదుడు. యథార్థదృష్టిమంతుడు, పరిహాస శీలుడునై వుంటాడు. నృపవిదూషకుడు అగ్రామ్య పరిహాస శీలుడు, కాంతా కవనాలలో నిర్మల బుద్ధితో ప్రవర్తించువాడు, మహిషీ పరిజనాల అభిమానానికి పాత్రుడు, అంతఃపురాలలో స్వేచ్ఛాచారి, ఈర్ష్యాళువు,

'జల మున్నది అది తులసిని
  కలిసివుంటే తీర్థం
కలువనిండి అజలమే
  తోడిక పోతే కావ్యం'
అంటారు శ్రీరెడ్డిగారు ఈవిషయాన్నే
మరో విధంగా చెబుతూ
'రసలుబ్ధతకు సమీ
  కృతమైన వేళ
శృంగారాలు పూయించును
  పాశవికత సంస్కృత
వేర మినిమి పీరులు తుంచి
  తుంచి కవళించును'

భూభ్రమణాన్ని గురించి కవితారీతిలో అలవస్తూ యీయన, ఒకమహాగ్ని గోళానికి శకలంగా విడిపోయిన స్ఫులింగాన్ని మర్త్యఅమర్త్యలోక మందునసే చల్లని మమకారంతో జరుగుతుంది నా భ్రమణం అని వర్ణించి
'ఒకటి కదిలేనిది, ఒకటినిలిచె వేల,
యీరెంటి తత్వాలు ఏకీకృతంకాగ,
రొట్టవతరించాగో యీధరా కం' అని
విస్తుపోయి
'శక్తి జడములు గ్రహములు, మరి
  మట్టిముద్దలు తారలు
ఒకనియతిలో తిరుగాడగా, ఒక
  అయతి ఊపిరిపోయగా
అతుల చైతన్య స్వభావుడు,
  మానవుడు లయతప్పెటెందుకు?
కానిదానిని తొక్కెటెందుకు?
అని వాపోతారు

అయినా ఆశావాదం మానవుని ఆరోగ్యాణం గనక, అదిలేనిది బ్రతుకేమిటి? నరకప్రాయం అని తనకుతాను సమాధానం చెప్పుకుంటూ
'ఉదారతకు, గభీరతకు
  ఓరిమికి, మగటిమికి
పతీకగా నిలిచిన ఎంద్రం
  గా అతనికేంద్రం
అని ఉద్ఘోషించేరు శ్రీరెడ్డిగారు.

(తరువాయి 9 పేజీలో)

## 5. శారదరాత్రులు

– శ్రీ కనగల నరసింహస్వామి, ఎం. ఏ.

* పావనగౌతమీ పులిన భాగములన్ శరదిందు చంద్రికా
ప్లావితమైన యీశుభవిభావరి దేవపురోధరో యనం
గావనజాసనుండె యనగా నడయాడు నదెవ్వరో హరా భూ
దేవులు మామకాంధ్రజగతీకవిధుర్యులు నన్నపార్యులా!

* అతులిత సంహితాధ్యయన! అచ్ఛచరిత్ర జగత్ పవిత్ర! సం
తతజపహోమతత్పర! ఉదాత్తతర ప్రతిభాఢ్య! ఆంధ్రభా
రత రచనాధురంధర! పురాణసముచ్చయసారపారగా!
నతు లివె నిత్యసత్యవచనా! గొనుమా! ధిషణాబ్బృహస్పతీ!

* తెలుగుపొలమ్ములోన నలుదిక్కుల తేజము నించు తత్ శరత్
విలసగ మొల్ల వచ్చుపడుతీరున భారతభావవీథిలో
సలలితవాక్కులన్ ఘటన సల్పుచు జారిన పైడిగంటమున్
నిలుపవు కేల గ్రమ్మరను నీవది యెక్కడి పారవశ్యమో!

* నీవు తెనుంగు కబ్బమున నిల్వలుగట్టిన కౌముదీఝరీ
శ్రీవిసరంబు నైక కలశీతతినించిన కోటిభావుకుల్
త్రావిన నిండుదోసిళుల దానముచేసిన స్నానమాడినన్
లేవడి కెందబోదు లవలేశము వేయియుగాలు దాటినన్

* అదిగో! నిరస్తనీరదవియత్తల మధ్యమునందు చెల్లరే!
కుదురుగ యామినీకరుడు కొ గ్వాసగన్ భవదుత్తశారదా
భ్యుదయము నాలపించునో యపూర్వగతిన్ స్వసఖీసహస్రముల్
పదపదమందు కౌతుకముపైకొని మాటికి పుల్కరింపగన్.

* శారదరాత్రులయ్యవి లసత్తర తారకహారపంక్తులున్
కైరవగంధబంధుర సుఖంకరవాయువులున్ సుధాంశు క
ర్పూరపరాగపాండురుచి పూరము లయ్యవి నైనసేమి యె
వ్వారికి నేడు కావలయు వాగనుశాసన! తత్ సుఖాంశముల్!

## 6. బ్రతుకు అతుకు

- శ్రీ పి.వి.ఎల్. సుబ్బారావు

తిమిరం నిండిన నింగిలో,
తార మెరిస్తే వెలుగు
సమరంలో చిక్కిన నేలలో
ఆశ నిలిస్తే గెలుపు
ఆశ మెరిస్తే బ్రతుకు తళుకు
తళుకు బ్రతుకు ఆనందం చిలుకు
నిరాశ నిలిస్తే మరిబ్రతుకు చితుకు,
అందుకే,
బ్రతుకు ఆశకు అతుకు

— • —

( 8వ పేజీ తరువాయి )

ఈ వచనకవిత గేయకవితకు దగ్గరగా వుంటుంది. ప్రాసనియమం కొన్నిచోట్ల, అంత్యప్రాసనియమం మరికొన్ని చోట్ల కనబడుతుంది. గేయానికి దగ్గరగావుండే వచనంతో టి. యస్. ఎలియట్ వంటి వారు ఆంగ్లంలో కాక్ టైల్ పార్టీ వంటి నాటకాలు వ్రాసి యీారకమైన కవితా ప్రక్రియను జయప్రదంచేసేరు. తెలుగులో కూడా శ్రీనారాయణ రెడ్డి గారి చేతుల్లో యీా నవీనమైన సాహిత్య ప్రక్రియ జయప్రదమైనదని చెప్పవచ్చును.

విశ్వాత్మను వికసింపజేసి, మానవునిలో వుండే ఉదాత్తగంభీర గుణాలను, రమణీయ కావ్యరూపంలో నిరూపించే భూమిక రసజ్ఞ శేఖరులందరికీ శిరసా పరిధార్యం.

— • • —

## 7. కృష్ణపక్షము - ఒక సమాలోచన

- శ్రీ వెలుదండ నిత్యానందరావు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'కృష్ణపక్షము నిజంగా విశిష్టమైన, ఒక వినూత్నసృష్టి. 'ఏకోరసః కరుణ ఏవ' అన్నట్లు దేవులపల్లి సాహిత్య మంతయూ కరుణ రసస్ఫోరకంగా నుండి ఆకరుణము లోనే ఒక ఆనందాన్ని చవిచూపించును. ఈ భావకవిత్వము ఒక వస్తువు కాని, కథ కాని ఉండకపోవుటచేతను, కేవలం ఆత్మాశ్రయ కవిత్వము కావడం చేతను, మనకు ఒకానొక అస్పష్టపు అనుభూతి నందించును. అంతేకాని స్పష్టమైన చిత్రణకు తావీయదు.

కృష్ణపక్షము, శుక్లపక్షము అని రెండు పక్షములు, కృష్ణపక్షము అమావాస్యాంతము, శుక్ల పక్షము పౌర్ణమ్యాంతము ప్రథమ పక్షము చీకటిని ద్వితీయ పక్షము వెలుతురును తెచ్చును. సాధారణముగా కృష్ణపక్షమును దుఃఖమునకు, బాధకు, శుక్లపక్షమును సుఖమునకు, ఆనందమునకు ప్రతీకలుగా కవులు భావింతురు తమస్సును, దుఃఖాన్ని సూచించు కృష్ణపక్షమును ఏకవియూ కవితావస్తువుగా స్వీకరింపడు కాని కృష్ణశాస్త్రి గారు కృష్ణపక్షమునే కావ్యేతివృత్తముగా గైకొనుట ఆ ధ్రువసాహిత్యాంగణమున నవ్యాతి నవ్యము ఇతః పూర్వము లేనిది.

వీరు పిఠాపురము నేలిన మహారాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దర్ గారి ఆస్థానకవి అగుటచే స్వామి భక్తితో వారికే కృష్ణ పక్షము నంకితమిచ్చారు. కృతిపతి నుద్దేశించి కవి

'తరుణ శృంగార మధురమాధవుడ వీవు
కలికి పాటల కోయిల కొలము మాది
మాలగా దాలి పాటలపూల తోడ
హృదయమేకూర్చి నీకాలు కెదురుచూతు'

అంటాడు ప్రస్తుతకావ్యమున మొత్తం 52 కవితాఖండిక లున్నవి.

కృష్ణశాస్త్రి మిక్కిలి స్వేచ్ఛాప్రియుడు. భారత దేశంలో నాడు వెల్లువుతున్న స్వాతంత్ర్యేచ్ఛ కవి హృదయం చీల్చుకొని ఈ విధంగా స్వేచ్ఛాగానం' చేసింది.

'తిమిర లత తారకాకుసుమములు దాల్చ
కర్కశశిలయు నవజీవ కళలు దేల
మోడుపోక చివురులెత్తి మురువుమీర
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు'

ఈ కవిత స్వాతంత్ర్య భానూదయమునకు పూర్వమే ఎన్నో ఏళ్ళక్రింద విరచింపబడెను. గాఢాంధకార మను లతకు నక్షత్రములనే పూలు పూచునటుల, కర్కశమైన శిలలు సైతం నవజీవన కళలతో కలకలలాడునటుల, ఎండిపోయిన మోళ్లు జీవము పోసుకొని చివురులెత్తి మురిసిపోవునటుల జగమంతయూ స్వేచ్ఛాగానము అను ప్రవాహముతో నింపివేయుదు నంటాడు కవి. ఇంకా

'గగనతలము మాగ్రోగగ కంకమెత్తి
చిత్తమానంద మయ మరీచికల సోల
కనుల నానంద జనితాశ్రుకణములూర
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు'

అని చాటుతాడు.

కృష్ణశాస్త్రి ఎక్కువగా ఝురములను, తేట్లను ఉపమానములుగా వాడుటలోని అంతరార్థము తానెవరికీ తన ఆత్మాభిమానమును తాకట్టుపెట్టి లొంగిపోయే వ్యక్తి కాదని స్పష్టపరుచుటకే. ఇందుల కొక చిన్న నిదర్శనము కృష్ణశాస్త్రి గారు మొదట ఒక మిషన్ స్కూల్లో ఉపాధ్యాయుడు. పిదప దానికి సలాం

కొట్టి పిఠాపురం రాజావారి ఉన్నతపాఠశాలలో చేరారు. అదికూడ సరిపడనందున దానికి తిలోదకాలొసంగారు. తరువాత 1932 నుండి 1941 వరకు కాకినాడ కళాశాలలో ఉద్యోగం. 1932-41 మధ్య P R కాలేజీ అధ్యాపకులుగా నియమితులైరి కాని అందులోను అధికారుల అహంకారమునకు తలయొగ్గక స్వస్తి చెప్పి సినిమాలకు మాటలు పాటలు వ్రాయుటకు మదరాసులో స్థిర పడ్డారు. అక్కడ కూడ ధనలక్ష్మికి, నిర్మాతల 'బలవంతపు లక్ష్మికి' లొంగిపోయి సినిమా రెడీమేడ్ సరుక్కు తయారుకాక చక్కని పాటలే వెలయించారు.

కృష్ణ పక్షమును చదువు తున్నపుడు కవి తనను ఒక నాయికగా భావించి ప్రియుని ఆహ్వానించు చుండెనా? అని అనిపిస్తుంది. 'లేటి వలపు' నోరి, ఒక నాయిక చేయు ఆహ్వానంచ ట్లున్నది.

'మలయ సమీర కిశోర్వికల
మాలికలం బ్రియుడార్ద్ర గీతికల్
మలయుచు నాట్యమాడవు సు
మ ప్రమదామణి పుల్కరింప నో
యలివర తేని లానవు త
త్కాంతర మంతరయూః జిన్నవోయె గో
మల జల జాత పత్రముల
మాటున నేటికి దాగినాడవో'

అని ఒకసుకుమారాల తన మధురమరందమును మధుపాయి కర్పింప ఉవ్విళ్ళూరుచున్నది. ప్రియుడు సన్నిధికి రాలేదని విరహోత్ర అయినట్టి ఆలేమ 'నవప్రసూనమోదయుహాస చంద్రికల్ చిలుకదు, తోడి చిన్ని చిరుచేడలలో జతగూడి నాట్యముల్ సలుపదు, మంచు ముత్యముల మట్టుగి తాల్చదు'. అతిరాజ లలితమనోజ్ఞమూర్తి మనోహార గాన సత్కారా విలసితుడు, ఆగ్ర చిత్తుడని ఆ వేల వరించిన దంతే కాని వీడు వట్టి నీరస హృదయుడని ఎరుగలేక పోయెను. అందుకే చలం అంటాడు 'కృష్ణ శాస్త్రి తన బాధ అందరిలోనూ పలికిస్తే, శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు'
'కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ' అంటాడు చలం

మామూలు మనిషికి అమవసనిశి యైనను, పున్నమ రేయి అయినను సమానమే. కాని 'కవితమా'వరులకు ఆ రజని నవ నవోన్మేష కాలినిగా గోచరించి, సత్యభావములను వెదచల్లును. అందుకే కృష్ణశాస్త్రిగారిలా వక్కాణిస్తారు

'శ్యామలాంబర పరిణాహాసగనిలోనః
ప్రణయ లీలావిహార విలాసిను లగు
తారకల గాంచుమా! నీహృదయమునందు
భావ నక్షత్రకాంతులు పర్వునేమొ'

కృష్ణశాస్త్రికి ఆ కారుచీకటిలో నిండిన ఆకస మొక విశాల కల్హారముగా, తారక లేమో ప్రణయ లీలా విహారములు సలిపే విలాసినులుగా కానిపించెను. మరి మనకు మరో విధంగా దర్శన మీయవచ్చును. ప్రకృతిలో భాగం ఒకరి సొత్తుకాదు దానిని ప్రతి కవి తనకు చేతనైనంత, కోరినంత, తన సొంతం చేసుకొంటాడు.

ఈకవి ఎవరికీ ముదము కల్పించని కృష్ణ పక్షాన్నే ప్రేమించి ఎన్నుకొనుట ఎందుకో అని మనకు వచ్చిన సందియమే వారికి కూడ వచ్చినదేమో అందుకే ఇలా పేర్కొన్నారు.

సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?

అని ప్రశ్నించుకొనిరి. బహుశా కృష్ణ పక్ష మనగా చీకటి పక్షమని కాక కృష్ణశాస్త్రి పక్ష మను అర్థంలో పేరిడి యుందురు.

ఇక శాస్త్రిగారి భక్తి తత్త్వమును కొంచెంగా పరిశీలించి ముగిస్తాను. సర్వజగత్తులకు సృష్టికర్త, సర్వాత్ములకు గమ్యం అయిన ఆ భగవంతునికి మన మేమి ఇవ్వగలము? ఏమీ ఇవ్వలేకున్న మాటను ఒక దాన్ని చెప్తే కవి ఎలా అవుతాడు? 'తారకాకారత్న భాసురమైన హృదయ పతి మృదు పద రజోలేశ సంపదను వలచి తిరుగాడే పేద కాన్కగా ఏమి సంగగల' డంటూనే పెద్దలన్నట్లు పత్రం పుష్పం, ఫలం, తోయంగాక

గాఢ అజ్ఞాన తామస సంకలిత హృదయ
నీరజ దళాల రాలు కన్నీటి చుక్క
కాక, మనసార వలపూర కలత దీర
కాన్కగా నే మొసంగగా గలను నీకు'
అని ఒక కన్నీటి చుక్క రాల్చుతాడట. బహుశః ఇదియే తోయప్రదాన మేమొ!

కృష్ణ శాస్త్రి గారిని గూర్చి చెప్ప బోతుంటె ఎంతైనా కాలం తీసుకో వచ్చు. వారు ఉత్తమ తరగతికి చెందిన ఉత్తమ కవి అని పేర్కొనుచు ముగించు చున్నాను.

'కరుణరేఁ తన పక్షమ్ముగ కమనీయ
కవిత లందించి మురిపించు కవివరుండు
కృష్ణశాస్త్రి కర్పించెద హృదయపూర్వ
కమగు నక్షర నీరాజనమును నిపుడు'

* _ *

## 8. తెలుగుబిడ్డ

శ్రీ ధూళిపాళ అర్కసోమయాజి

*సద్యశ్శాంతి వహించుచున్ గురువులున్
శాసించు మార్గమ్ములన్
విద్యాభ్యాసముఁబూర్తిఁ జేసి ధిషణా
వృద్ధిప్రభాభాసితన్
'విద్యాదానము జన్మసార్థక 'మను నీ
విధ్యుక్త ధర్మంబుతో
హృద్యంబైన వచస్సుధాప్తి గలవు హా
యిన్నింటఁబ్రోవా! బిడ్డఁడా!

*ధరలోఁగల్మిఁ బొంగ కెన్నడును ద
ద్దన్ లేమిలో గుందియోఁ
గరమాన్నంబుగ స్వీకరించుచు, సుధుల్
వత్స్యా! యనంగా భువిన్
చిరకాలమ్మును శిష్యబృందములు సా
సింగొల్వఁ బ్రఖ్యాతితో
వరసారస్వత పట్టభద్రత తగన్
వర్ధిల్లినా బిడ్డడా!

*మహ్యాకల్పోద నీ తెనుగు
మాన్యమునం బరిపూర్ణ దేశముల్
శ్రోత్రించుఁ బాండితీవిభవ
తోయములం బ్రవహింపఁ జేయుచున్
ఒక్కొక్క శాఖ యందును మ
హోన్నతినొందుచు నాల్గుదిక్కులన్
చక్కని కీర్తిచంద్రికల
సన్నుతిఁ బొంగుము తెల్గుబిడ్డఁడా!

*విశాలత్వరహస్య వేది వయం వి
జ్ఞానామృతస్ఫూర్తిచే
నవసాహిత్యపు వీథులందు గొను మ
న్నా! నీమహత్వంబుచే
నవధానాదు లొనర్చుచున్ పృథివిలో
నాచంద్ర తారార్కమున్
కవితాంతుల్ విరజిమ్ముఁగా వెలిఁగుమా లో
కంబంత ఆహా! యనన్.

## 9. సాహిత్యకోవిదుని చంపకమాలా సౌరభాలు

- శ్రీ పి. వి. ఎస్. శాస్త్రి.

పోతన మందారాలు, పెద్దన గొజ్జగులు, తిమ్మన పారిజాతాలు తెలుగు సాహిత్యోద్యానంలో వెలుగుతు వెదజల్లే కలం పూలు ఆకోవకు చెందిన పూవిలాసినులే సాహిత్యకోవిదుని చంపకాలు.

'నానా సూన వితాన వాసనల నానందించు సారంగ మేలా నన్నొల్లద' టను రామరాజ భూషణుని చంపకం తపస్సు చేసి కామితార్థ సిద్ధిని పొందింది శ్రీరామంగారి చంపకాలు స్వామి చరణ సరోజాలను స్పృశించి ఇంపుసొంపులు నింపుకొన్నవి

'జననుతి పాత్రమౌ గతిని
చంపకమాలలు తావకాంఘ్రులన్
ఘనముగ నంటి కాంతియుతము
గంధము చిమ్ముచు సొంపుజూపెగా
జనసము సార్థకం బగుచు
చంపక మాలలు నావి కొన్ని యీ
ఘనత వహించు పుష్పముల
గంధము కొంచెము చేకురించెనన్'

అను పద్యమింగు ఉదాహరణమై కవి మహాశయుని నమ్రభావాన్ని క్రమంగా చాటుచున్నది. శ్రీరామంగారు అష్టోత్తర శత చంపకాలను సృష్టించి శ్రీవేంకటేశ్వరుని పద పంకేరుహాలకు అంకిత మిచ్చారు. అవి వసివాడని పసగల పసిడి కోమలులు.

'సాహిత్యకోవిద' శ్రీ క్రొవ్విడి రామంగారు జగమెరిగిన బ్రాహ్మణులు. జిల్లా పరిషదున్నత పాఠశాలా ప్రధానాధ్యాపకులుగా నుద్యోగించి విశ్రాంతి గైకొన్నారు. విజయనగరవాసులు. వీరి సుకృతులు 'సాహిత్య సౌరభం' వ్యాస పారిజాతాది బహుగ్రంథకర్త. వీరి చిన్న సంసారజీవనం ఆదర్శాల వేదాధ్యయనం. శ్రీరామంగారి వడవడి వర్ధమాన కవులకు ఒరవడి. వీరి ఆదేశాలు నాబోంట్లకు శిరోధార్యాలు. పదునెనిమిదేండ్ల క్రితం వీరి 'ఎహూ చరిత శతక మాలిక'ను తెలుగు పాఠకులకు తొలిసారిగా పత్రికాముఖమున పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది మళ్ళీ నేటికీ 'అష్టోత్తర శతచంపకమాల'ను సమీక్షించే అదృష్టం కూడ నాకే చేకూరింది ధన్యోస్మి!

చిప్పలో పడిన చినుకు ముత్యమౌతుంది శంఖంలోపోసిన నీరు తీర్థమౌతుంది భగవానునికి నివేదించిన పదార్థం ప్రసాదమౌతుంది. ఆచరణ శీలుని పలుకు సుభాషితమౌతుంది. వంకరపనులు చేసే వాడు ఏది వాగినా వగరుగానే ఉంటుంది వగరు చిగురు మేసే కోకిల ఏది పాడినా మధురంగానే ఉంటుంది. అదే తపస్సు. అతపఃఫలం అందరికీ సిద్ధించగు

శ్రీరామంగారు నాలుగు దశాబ్దులు సాహిత్యకృషి చేసి విశేషానుభవంతో చంపకమాలను కంఠరించారు. భక్తి ప్రపత్తుల సమ్మేళనంతో ఆత్మనివేదన గావించి రచింపబడిన వీరిగ్రంథం శంఖంలో పోయబడిన తీర్థమయింది. సనాతన సాహితీసంప్రదాయాన్ని విస్మరింపక, ఆధునాతన నవీనరీతుల నభి

---

*జాగరవమ్మునన్ సుకవి
జాలము మిక్కిలి మెచ్చునట్లుగన్
వీనుల విందుఁ జేసెదు క
విత్వము అల్లుచు తేటతేటగా
తేనెలు జాలువార భువిఁ
దెల్గు ప్రజాళికిఁ బంచి నిత్యక
ళ్యాణముఁ బచ్చతోరణము
నై వెలుగొందుము తెల్గుబిడ్డఁడా!

*_*

మానిస్తూ, ప్రాత క్రొత్తల మేలుకలయికతో చంపకాలకు ఒకవినూతన కాంతిని, విశిష్ట పరిమళాన్ని వెలయించిన మహామనీషి శ్రీరామం గారు.

శ్రీకారంతో ప్రారంభమై మంగళహారతితో ముగింపఁబడిన యీ గ్రంథాదిని విఘ్నేశ్వర స్తవము పూజావిధానమునకు ప్రథమ సోపానమే కాక, కావ్య రచన నిర్విఘ్నముగ కొనసాగుటకు నాంది యైనది 'ప్రభూ!' 'వేంకటేశ్వరా!' 'శ్రీకరా!' 'మాధవా!' 'దీనబాంధవా!' యిత్యాదిమకుటాలు శతక లక్షణాన్ని ప్రకట పరచినా, రసగుళికల వంటి వీరి చంపకాలు కావ్యాన్ని తలపింపజేస్తాయి.

వీరి భక్తిపారవశ్యానికీ చంపక సౌరభములో చక్కని తార్కాణం పరికించండి

'వరముల గోరి నీ గిరికి
వచ్చిన మాట నిజంబె కాని, నీ
నిరుపమ దివ్య దీధితుల
నిండిన మోమును గాంచిన ప్రభూ!
వరముల మాట యే మరచి
భాగ్యము పండిన దంచు నిత్యగా
జరగుదు వేగమంమ నను
చప్పున లాగెను భృత్యు డచ్చటన్"

నిలువు దోపిడిని గూర్చి శ్రీరామం గారు లలిత లలిత పదాలతో ఎలా పలికారో యీ చంపకాన్ని తిలకిస్తే తెలుస్తుంది. అంతే కాదు, రసహృదయం పులకిస్తుంది కూడా!

'లలితములైన భావముల
లాలన చేసెడి సాహితీ సుధన్
వలువది యేండ్లు నుండి యిటు
నమ్రత తోడను కూడబెట్టి యీ
తొలకరి వేళలో 'నిలువు
దోపుగ' నీయగ నీకు సన్నిధిన్
నిలిచితి నీకృపన్ జిలికి
విస్తుల కీర్తి నొసంగవే ప్రభూ!

విజ్ఞానం వెత్తికల లెత్తింపగా భౌతిక వాదమే పరమసత్యమనెడి వారల కని వీరి సంపెగ పువ్వులు నవ్వులు రువ్వుచున్నవి. సమీక్షించండి.

"సగటున 'ఎక్స్‌రే' యనెడి
శక్తికి యెందములోని శల్యముల్
విరళముగా బయల్పడగ
వింతగ జూపుచు నుందుగాని; నీ
పరమ పవిత్రమౌ 'ఉనికి,
బాగుగ డెందము నందు పోల్చగా
నరహరి! దాని శక్యమగునా? .'

'ఉదధిని దాగియుండు పర
మోజ్జ్వల శైలము దొల్చి శైలముల్
కదలెడి నీటినుండి కను
గొనగ మెప్పుగ తెచ్చు మర్త్యుడే
ఎదుటను నిల్చు సోదరుని
ఏపగు ప్రత్తైరు దాగు యాదనల్
పదిలము గాను చెప్పగల
పాటవ మేలను పొందకుండెనో?'

సైంటిస్టుల కట్టు సవాలును తెలిపి, 'నాస్తికులు నాస్తి', అంటూ చమత్కరించిన యీ చంపకాన్ని పరామర్శించండి

'అరయగ సత్యమున్ శివము
హాయిని గొల్పెడి సుందరాకృతుల్
ధరణిని, దైవరూపమును
తథ్యముగా స్ఫురియింప జేయుటన్
తరముల నుండి వీని ఘన
తన్ మది నెంచెడి యెల్ల వారలన్
స్థిరమగు దైవభక్తులని
చెప్పక తప్పదు; లేరు నాస్తికుల్'

దైవ దర్శనానికి కూడ ప్రక్కదారులేవా? అంటూ యీ చంపకం దరహాసంతో పరిహాసాన్ని విరజిమ్ముతున్నది. పరికించండి

'విలువగలట్టి టిక్కెటుల
విత్తము జల్లుచు కొన్నవారికే
విలువగు నీదు దర్శనము
వేగముగా లభియించు నిచ్చటన్
కలిమి యొకింత లేని యొక
కష్టము హెచ్చును దర్శనార్థికిన్
కలియుగమందు దేవుడును
కల్మిని బట్టి యనుగ్రహించునా?'

ఈ క్రింది చంపక పరిమళం కవి నిరంకుశత్వానికి చక్కని తార్కాణం

విజయము గోరి ఓట్లకయి
విత్తము జల్లెడి వారికల్లకే
నిజముగ యోగ్యు రాజ్యరథ
ప్రజలది రాజ్యమన్న నుడి వమ్మయి పోయెను'

మొహమాటం లేకుండా డెమోక్రసీని ఈ చంపకం ఎలా సమీక్షిస్తున్నదో చూడండి

'మదమున డబ్బుతో పరమ
మూర్ఖుల ఓట్లను పొంది నాయకుల్
పదిలముగాను నిల్పుదురు
భారతమందు డెమోక్రసీ ప్రభూ!

కూపస్థమండూకాల వంటి పాఠకులకు పేపరు వాలెడ్జిని కూడ నీ చంపకాల ద్వారా అందించారు శ్రీరామంగారు. 'ఎక్స్‌రే', 'డెమాక్రసీ', 'మార్కెటు' 'క్యూ' 'టిక్కెటు' వంటి ఆంగ్లపదాలను సందర్భోచితంగా ప్రయోగించి అందాలను చిందించారు

సాహితీ దీధితి వీగులలో కవియొక్క భావసౌజన్యాన్ని ఈ చంపక సౌరభ మెలా గుబాళింపజేయు చున్నదో పాఠకులు తిలకింప గోరుచున్నాను.

'పదముల కొక్క మార్గమును
భావగభీరత కావ్యశిల్పమున్
మది కదిలింప జాలు నతి
మార్దవ దివ్యరసాను భూతియున్
మెదడున కంటియుండు నెడ
మేలురమా భవదీయకీర్తనల్
కదమును ద్రొక్కు గుణ్ణముల
కైవడి నే విరిపింతు దేవరా!

ఆదిశేషుడు నిన్ను విడువలేక సప్తఫణములను సప్తగిరులనుగా రూపము మార్చి నీ ప్రాపునకు వచ్చెనా? అంటారు శ్రీరామంగారు. తిరుమలను దర్శించి యెరుగని చదువరుని యీ చంపకాల సౌరభాలు తిరుమలను దర్శింపజేయు చున్నవి. ఒక్కొక్క పర్వతాన్ని అధిరోహిస్తుండగా కలిగే అను భూతిని చక్కగా వర్ణించారు.

'రజనియు నీలిమేఘము మొ ప
రాకన వచ్చెను కొండ గాదురా
నిజమిది యంచు పల్కెదరు' — అంటూ

వృషాద్రిని వర్ణించే యీ చంపక సౌరభం రసహృదయుల హృదయ సరోజాలను రెపరెపలాడిస్తుంది. ఆనాటి యాత్రికులు చక్కని పర్వత మెట్ల వేళలలో ఎదుర్కొను బాధలను సహజాలంకార శోభితంగా కవి వర్ణించారు. చదువరులను సప్తగిరుల నధిరోహింపజేసి, అందలి రసానుభూతిని అందింపజేసారు. ఆపిమ్మట శంఖము, చక్రము, గద, శార్ఙ్గము, నందకము మొదలగు స్వామివారి ఆయుధాలను, తరువాత శ్రీవారి దివ్యమంగళ విగ్రహాన్ని, పండిత శేషాన్ని పఠితల కండ్లకు కట్టినట్లు చిత్రించారు అన్నిటికి మిన్న చంపకాలతో వీరు షోడశోపచారముగ స్వామికొనరించు పూజావిధానము నందలి తీరు తీయములు ప్రశంసార్హములు.

'అటుకల మాట గట్టుకొని
అంబుజనాభుని దర్శనార్థులై
జటిలములైన మార్గముల
చక్కగ బోవు పచేలుభంగి, వా
క్పటిమను జూపి కూర్చు నవ
పద్యపరంపర చేత పట్టి, యీ
జటిలములైన మార్గముల
చక్కగ చేరితి నీదుసన్నిధిన్'

'అరువది యేండ్లు దాట బహు
హర్షముతో జనులెల్ల మెచ్చగన్
వరముల చేతనే సుకుల
పంక్తిరథుండిల పొందినట్లుగా
అరువది యేండ్లు దాట బహు
హర్షముతో హితులెల్ల మెచ్చగా
నిరుపమ కావ్య కన్యకను
నే మది గంటిని దీని నేలుమా!'

అను రెండు చంపకాలు అలంకార వాసనలను పులుముకొని సాహిత్యకోవిదుని కవితా పాటవానికి మచ్చుతునకలై విరాజిల్లుచున్నవి.

తిక్కన హరిహరాద్వైతము, కృష్ణరాయని కీర్తిరేఖలు, అన్నమాచార్యుని భక్తిభావము, ఉపనిషత్తులలోని ఉదాహరణములు, మార్గళి నోమును పట్టిన చిన్నారి కన్నియల రాగాల సొంపును యీ చంపకాలద్వారా శ్రీరామంగారు పాఠకుల కందించారు శ్రీనివాసునికి తిరుమలలో బంగారురథం చేయిస్తున్నారన్న వార్తను విన్న తర్వాత' వనజభవాదులే యిటకు వత్తురు చోద్యము చూడ మాధవా!' అన్నారు. ఇంకను,

'భువిగల తీర్థరాజముల
భూరియశంబును పొంది నట్టిదై
భవమున గల్గు పాపముల
భస్మముజేసెడి పుణ్యభూమియై
కవులను గాయకుల్ కలసి
కావ్య మరందము నిమ్ము నీమయై
జవమును జీవమున్ గలిగి
చక్కగ తిర్మల వృద్ధిపొందుతన్'

అని ఆకాంక్షించారు. తిరుమలను దర్శింపని పాఠకుడు మహానందాన్ని, దర్శించిన పాఠకుడు మరోమారు తిరుమలను దర్శించా ననెడి ఆనందాన్ని యీ గ్రంథపఠనమువలన పొందగలడు సాహిత్యకోవిదుని చంపకమాల సౌరభాలు తెలుగునీమ నలుగడల వ్యాపించుగాత' కవి భూషణ శ్రీ మూలా పేరన్న శాస్త్రి గారి అభినందన పద్యంతో ఈ నా సమీక్షా వ్యాసాన్ని ముగిస్తున్నాను.

'రామము గారి పద్యములు
రమ్యములై మధురార్ద్ర సత్సుధా
ధామములై మనోజ్ఞ సుమ
దామములై, రుచిరంబులై, శచీ
రామ గళాంతర స్థల వి
రాజిత రత్న విభూషణంబులై
ఆమెత అట్లు హర్షదము
లైలసి విల్లుc దెలుంగు నీమలోన్'

)o(

# 10. దిసమొల నాగరికత

శ్రీ అడ్డేపల్లి రామమోహనరావు, ఎం. ఏ.

నగ్ననితంబ చిత్రాన్ని గీసితెచ్చాడు
మిత్రుడు
అందులోని అందాన్ని అభినందించ
మన్నాడు
అంతర్జాతీయంగా సౌందర్య దర్పణం
ఈ దిశగానే సాగిపోతోందన్నాడు.

ఆ చిత్రం వంక ఏకాగ్రంగా చూశాను.
అమెరికన్ క్రైమ్ సినిమాల్లో
శాడిస్ట్ కుహకుల మీద
పల్లి ముగ్గులువేసే దిక్కులేని
దిసమొలల దీనారావాలు వినిపించినైనాక.

ఒక చేతిలో న్యాయస్థానం పీకనీ
రెండో చేతిలో అసహాయురాలి పీకనీ
పట్టుకుని
రాజకీయ రాక్షసుడు చేసే మానభంగానికి
స్పృహతప్పి పడిపోయిన ప్రజాస్వామ్యం
కనిపించింది నాకు

గోడలనిండా, వెండి తెరలనిండా
తమ చీరలోపలి అవయవాల్ని
తమ ఎదురుగా చూపిస్తుంటే
వికలిమగతనం అట్టహాసం చేస్తుంటే
తల్లిలో, చెల్లిలో, భార్యలో ,
అందరిలో ఒక వేశ్యని మేలుకొలపడానికి
పట్టు పట్టిన వ్యాపార నాగరికత
వికటాట్టహాసం వినిపించింది నాకు.
కళ్ళు తెరుచుకు చూస్తున్న ప్రజ
అందరి ముందూ
దు 'శ్శాసనుడు'
తనకు అడ్డొచ్చే అవతారం లేక
సంస్కృతిచీరను పూర్తిగా ఒలిచేస్తుంటే
కన్నీటితో భవిష్యత్ శ్మశానాలు
కడుతున్న స్త్రీత్వం కనిపించింది నాకు.

నగ్ననితంబ చిత్రాన్ని
చించి అవతల పారేశాను.

( తరువాయి 14 వ పేజీలో)

# 11. జానపదుల అత్తాకోడళ్లు

- శ్రీ కొల్లా వెంకటరమణారావు, ఎం.ఏ

పట్టణ వాసులైన అత్తాకోడళ్ళలో చాలవరకు ఒకరిని గురించి ఇంకొకరు ఎక్కువగా ఆలోచించరు ఒకరి నొకరు దూషించుకోరు. కొందరు ఉప దేశాలు చేసుకోరు దీనికి కారణం లేక పోలేదు పట్టణవాసులు కాపురం వేరె పెట్టుకొని ఉన్నప్పుడు, ఇల్లుకూడ వదులు కొని దేశదేశాలంట తిరుగుతూ వుంటారు. అందుచేత కోడలుగాని, అల్లుడుగాని అత్తింట కాపురముండడ మనేది వీలు కాదు. కాని జానపదులు ఉన్న పల్లెను, పొలాలను నమ్ముకొని జీవించే స్వార్థరహితులు అందువల్ల కోడలికి అత్తవారింట కాపురం చేయడం తప్పనిసరి జాన పదుల అత్తాకోడళ్ళు గొప్ప సెబాసాలు. వీరిద్దరి సంబంధం పులీ మేకా సంబంధం. అత్త చెప్పే సలహాలు కోడలి చెవి కెక్కవు. కోడలు చేసే ఆలోచనలు అత్త బుర్రకెక్కవు. నిత్యమూ తిట్టుకుంటూ వుంటారు. అంతేకాని పువ్వుల్లో దారంలా ఎప్పుడూ కలసి వుండరు

కోడలు చేసే పనులను ఎత్తిపొడుస్తూ కోడలిమీద కారాలు మిరియాలు నూరడం అత్తకు అలవాటు. అత్త లేనప్పుడు, అత్త ఉన్నా చాటుమాటున, ఆమెను తిట్టుకోడం, శాపనార్థాలు పెట్టడం కోడలికి రివాజు. అత్తా కోడళ్ళనుగూర్చి జానపదులలో ఒక చక్కని పాట ప్రముఖ ప్రచారములో వుంది

'అత్తలేని కోడ లుత్తమురాలు
కోడలూ లేని అత్త గుణవంతురాలు'

అత్తలేని కోడలు ఉత్తమురా లట అవును మరి అత్తలేకపోతే కోడలు చాటుమాటున తిట్టుకోదు 'ఈ శని ఎప్పుడు వీగడౌతుందా' అని ఎదురు చూడదు, ముక్కున చేయిడి కొంగున మూట కట్టదు. మరి ఉత్తమురాలు కాకుండా వుంటుందా? ఇక కోడలు లేక పోతే అత్త గుణవంతురా లట. కోడలు లేకపోతే ఆపనీ ఈపనీ చేయమని అత్త పోరంచనూ లేదు కోడలుమీద కారాలు, మిరియాలు నూరనూలేదు అటువంటప్పుడు అత్త గుణవంతురాలే

జానపదుల అత్తకోడళ్ళలో ఎక్కువగా అత్తకే పైచేయి. కోడలిని ఏదో వంక పెట్టి దెప్పి పొడవడం, తిట్టడం, చిన్న చిన్న దొంగతనాలు అంటగట్టడం కొడుకుతో కోడలిపై చాడీలు చెప్పడం అత్త ముఖ్యోద్దేశంగా కనబడుతుంది. అత్త ఒకంటి కోడలే అని ఆమె ఆలోచించదు. కోడలిని ఏ విధంగా సాధిస్తుందో చూడండి

'కోడలా కోడలా కొడుకు ముత్యమ్మా
గంగరేగు పండు బంగారు బొమ్మా
దివ్వెట్టి నాకొక్క పేను నొక్కమ్మా
కూటికుండ మీద గుత్తులే వమ్మా
పచ్చిపాల మీద మీగ లేదమ్మా
వేడిపాల మీద వెన్న లేదమ్మా'

పగలంతా ఇంటి పని చేసి అలసి సొలసి పోయిన కోడల్ని దీపం పెట్టుకొని తన తల్లో పేలు చూడమంటుం దే. పైగా కూటికుండ మీద గుత్తులు, పచ్చి పాల మీద మీగడ, వేడిపాల మీద వెన్న అడుగుతుంది. ఈ ప్రశ్నలకు ఆ కోడలు అత్తఎదురుగా జవాబు చెప్పే ధైర్యంలేక అత్త లేనప్పుడు ఇరుగు పొరుగు లతో చెప్పుకొని భోరున ఏడుస్తుంది

'ఇరుగు పొరుగులార! ఓ అమ్మలారా!
ఎన్నడూ మాయత్తచోద్యాలువిన్నారా!
.
కూటికుండ మీద గుత్తులే వనునూ
పచ్చిపాల మీద మీగ లే దనునూ
వేడిపాల మీద వెన్న లేవనునూ!'

తనను సాధిస్తున్నందుకు, తనపై దొంగతనాలు అంటగడు తున్నందుకు బాధ పడుతూ ఈ మానవ జన్మ ఎత్తి నందుకే మిగుల విచారిస్తుంది.

'మానవ్వ కాపైతె మంచి పేరూరు
చెట్టయినా కాపైతె చెలగి పేరూరు
..
ఒలుకు మా తండ్రి కాలు పిండంగ
బంగారు చెంబులో ధార గావైతె
ఒరిదేవి మాతల్లి చల్ల చేయంగ
చెల్లిపోయె కవ్వాన చిలుపగా నైతె. .'

అమ్మగారింట వెన్నపూసలా, పాల ధారలా పెరిగిందట ఈ కోడలు. అయినా అత్త అంతటితో పూరుకుంటుందా..! కోడలు పెనుతిరుగుడులు తిరుగుతుం దట.

'కోడలా! కోడలా! కొడుకు పెళ్ళామా
కొడుకు ఊళ్ళో లేడు మల్లె లెక్కడివే?'

కొడుకు వూళ్లో లేకుండా మల్లెలు ముడిచిందట ఈ కోడలు చక్కగా స్నానం చేసి, శుభ్రమైన చీరకట్టుకొని సిగలో మల్లెలు సింగారించుకొని భర్త కోసం ఎదురు చూడాలని అత్తగారి ఉద్దేశ్యం కాని మరి కొడుకు వూళ్ళో లేడుగా అయినా ఎందుకు సింగారించు కుంది అంతేకాక, భార్యసిగలో మల్లెలు భర్తతెచ్చినవే కావాలట భర్తవూళ్లో లేక పువ్వులెలావచ్చినట్లు? ఈసూటిపోటిమాట లకు ఎంతటి సీతాదేవికైన ఒకింత కోపం రాక పోదుగద అయినా వచ్చి మాత్రం ఏం చేయగలుగు? భర్తతో చెప్పి వేరే కాపురం ఉందామన్న గలదు .. ఏదో వంక పెట్టుకొని భర్తను ఉమ్మడి కుటుం

---

( 13వ పేజీ తరువాయి )

మిత్రుడు నిప్పులు చిమ్ముతూ నావంక
చూశాడు.
'అందమంటే నీకు తెలియదు లేమ్మన్నాడు
'వడిపిలో సమాజాన్ని చెరిచి
నెత్తురుమడుగులో పొర్లించే అందం
నాకూ వద్దు, నాదేశానికీ వద్దు
పొమ్మన్నాను.

)*(

## 12. ఆస్థానకవి అపురూపపు కవితాసంపుటి – “ఆలోచనాలోచనాలు”

– శ్రీ కర్రా కార్తికేయశర్మ.

అగ్నిధారను కురిపించి, రుద్రవీణను పలికించి, మహాంధ్రోదయాన్ని గానంచేసిన మహాకవి, ఆంధ్రప్రదేశ ఆస్థానకవి, కళాప్రపూర్ణ, డా॥ దాశరథి కలంనుండి వెలువడిన అపురూపపు కవితా సంపుటి ‘ఆలోచనాలోచనాలు’

కవి జీవిత ప్రారంభంలో దాశరథికవితను ఆవేశం పట్టినడిపిస్తే ఈమధ్య దాశరథి విరచించే కవిత్వంలో రంగూ-రుచీ-వాసనా అంతకుమించి అలౌకిక సౌందర్యం జీవధారగా ప్రవహించడం గమనార్హం! ఏళ్ళ మైలురాళ్ళను దాటివచ్చి, జీవితం నేర్పిన అనుభవాలను, పాఠాలను, జీర్ణించుకున్న దాశరథి, అంతరంగ నిర్మథనంలో ఎన్నోమలుపులుతిరిగి తనతోపాటు కవితనుకూడా పండించారు దానికిఉదాహరణ ఈ కవితాసంపుటిలోని దోసిళ్ళ కొద్దీ కవితలు!

ఐతే దాశరథి కవిత్వనాదానికి నాదం చేకూర్చిన బొమ్మా-బొరుసూ, హాస్యం - అవహేళన!

‘రాజకీయ వహ్ని రగిలి నందనవాటి
పారిజాతతరువు వాడిపోయె;
పూలు దోయిలించబోయిన నాముందు
కంటకములరాశి కంట బడెను.
జాతికోరకు బ్రతికిజాతికై చితికిన
జాతిపితను మరచి జాలినారు
మనను పోషించి మన వెన్నుపొడిచిన
వానినే జపించ బూనినారు’’

ఈ ఖండికలలో కుటిలరాజకీయాలతో కలుషితమైనవాతావరణంలో ఇబ్బుపడిన మానవతకోసం జాతికోసం పెంగి ఆహుతి అయిన మహాత్ముడు, ఆయనను విస్మరించిన మన కృతఘ్నత స్పష్టంగా దర్శనమిస్తున్నాయి.

‘నిన్నదాక నే సామవేదిని
సామ్యవాదినైతి క్షణములోన
కూలిజనుల మేలుకూర్చి భాషింతును
తట్టవోయి టన్న తప్పుకొందు
‘విశ్వమానవులను ప్రేమించవలెనందు
ఇంటిప్రక్కవాని నీసడింతు.
అన్నిభాషలొకటె యని బోధనములాయె
తెలుగుబాస అనిన చులకనాయె.

క్షణక్షణం మారే భావాలు సిద్ధాంతాలు! కష్టజీవులను గూర్చి చేసే మహోపన్యాసం ఆచరణలో పలాయనం స్ఫుటంగా వర్ణిస్తూ-మనం మాట్లాడే మాటలకు-చేసే చేతలకు మధ్యనున్న అగాధానికి కొట్టూరుస్తున్నారు కవి

‘త్యాగరాజకృతులు తలనొప్పియాయెను
అన్నమయ్య పదము లన్న పడదు!
వీణమీటు టన్న వెక్కసంబాయెను
‘‘జాజు’’ మీద నాకు మోజు హెచ్చె’

అంటూ క్షణక్షణం మారే కృత్రిమ అభిరుచులనుగూర్చి

‘శాసనసభలోన సభ్యత్వ మాశింతు,
శాసనా లటన్న చాలవిసుగు
ధిక్కరించు టొకటె తెలిసినది యాయె
అమలు జరుపు టన్న శ్రమనిపించె’

రాజకీయవాదుల నిర్లక్ష్య వైఖరిని గూర్చి.

‘కాపికొట్టుహక్కు కల దని విద్యార్థి
జాగ్రఫీని తెచ్చె సైన్సు నాడు
ప్రశ్న కేమి వ్రాయు ప్రత్యుత్తరమ్మును
మార్కున్ననుసరించె మార్కునారక’’

విద్యార్థుల వింత వైఖరినిగూర్చి.

‘ పిట్టగూడు వోలె జుట్టు పెంచితినేను
క్షౌరశాలలన్ని ఆరిపోవ
నూలుమిల్లులకును తాళాలుపడునేమొ
హిప్పినైతి గుడ్డ విప్పివైచి’

నేటి యువకుల కృత్రిమ విశృంఖల వేషధారణనుగూర్చి కొరడా కొసలవంటి ఖండికలను విరచించారు దాశరథి.

‘‘పైపైసొగసులుం కల్లసుమా!
లోపలిదంతా డొల్లసుమా!
నిజం తెలియుమని నేనంటాను
లేదా కొంపే గుల్ల సుమా!’

అనడంలో దాశరథికవిగా తనబాధ్యతను నిర్వర్తించిన వారయ్యారు.

‘బండను కోయాలి కుసుమదళం
గుండెను కోయాలి నయనజలం
కదనరంగమున నేనంటాను
కత్తిని మించాలి కవుల కలం’

అనడంలో కలంపట్ల ఆయనకున్న నమ్మకం వ్యక్తమౌతోంది. ఒక్కకలంపోటుతో అతుకు మెదళ్ళకు కదలిక పుట్టించవచ్చన్నది ఆయనసిద్ధాంతం!

‘భారతీయులది భాగీరథి
పాకీయులది రావినది
నదులెట్లున్నా నే నంటాను
కలుసుకోవలె హృదయ నది’

విజం! అలాజరిగినపాడే శాంతి క్షేత్రంలో ప్రగతి మొక్కలను మనం నాటగలం! శాంతిపుష్పాలను పూయించగలం. ఇక దాశరథి 'ప్రణయక్రీడ'ను దర్శిద్దాం!

'నీలమేఘం కొండను చుట్టేసుకుంటే
నేల కనబడక, కొండ శిఖరం
ఎగిరిపోతోందని
అమాయిక సిద్ధాంగనలు భయపడి
ఆలింగనం చేసుకున్నారు తమ ప్రియులను'
అన్నాడు కాళిదాసు అనాడు
'వేగంగా వచ్చే స్కూటరు హఠాత్తుగా
ఆగిపోయేసరికి, యాక్సిడెంట్ అని
భ్రమ పడి
పిలియన్ మీద కూర్చున్న పిల్ల
సీటుమీది సీటు వాణ్ణి వాటేసుకుంది'

అన్నాడు కే దాసు ఈనాడు

అనాడూ ఈనాడూ కూడా
ఇంచుమించు ఒకేరకం ప్రణయక్రీడ!'

హాయిగా సెలయేటిధ్వనిలా, తుంటపాటలా, కోలపాటలా, మనసుకు సుగంధాన్ని అద్ది సంతోషాన్ని కలిగిస్తోంది ఈకవిత 'నీలమేఘం కొండను చుట్టుకొనగా నేల కనబడక పోయేసరికి కొండశిఖరం ఎగిరి పోతోం దని భయపడి ఆ సిద్ధాంగనలు ప్రియులను కౌగిలించుకొనడ మనే దృశ్యాన్ని కాళిదాసు మధురంగా చిత్రిస్తే - పిలియన్ మీద కూర్చున్న పిల్ల స్కూటరు హఠాత్తుగా ఆగిపోయేసరికి యాక్సిడెంటని భ్రమపడి సీటుమీది సీటు వాణ్ణి కౌగిలించుకొనడ మనే దృశ్యాన్ని మెచ్చగా చిత్రించారు దాశరథి

దాశరథి 'ఆలోచనాలోచనాలు' ఎంతఅపురూపమైనవో నిరూపించడానికి ఒక్క ఉదాహరణ

(తరువాయి 18వ పేజీలో)

# 13. నివేదనము

— శ్రీ కావూరి పూర్ణచంద్రరావు, ఎం.ఏ., బి.ఓ.ఎల్.

* ప్రాతర్గ్రంథర శైత్యబంధుర జగత్ప్రాణంబు వీచోపుతై
చేతఃప్రీతి నొసంగ శిష్యతతి ఆ శిర్వాదముల్ పొంది ప్ర
స్ఫీతాశ్వార్థ విశిష్ట తత్త్వములై చిత్తంబు కాత్రింప లో
కాతీతార్థ విశేషముల్ వినుచు బ్రహ్మానందముం దుక్కొంటుండై

* గాత్రిం గొక్కడు స్ఫుటోచ్చారణ వీనులవిందుం జేయుచు శివానందలహరి
దీక్షతో నొక్కయం తేవాసి లలితా సహస్రంబు సార్థకావ్యముగం జదువు
భాగవతగ్రంథ పారాయణముచేయు శ్రోత్రి సేయుముగ శిష్యుం డొకండు
వల్లించు సాధకవర్గిత యొక్కండు సత్సంగి కర్ణరసాయనముగ
బ్రహ్మఋషి యప్పుడప్పు పురాణములను, శాస్త్రములను తత్త్వార్థనిశ్చయము చేసి
వెడలి దైవంబు పూజించు వేళ నిమిషంబు నిమ్ వ్యర్థంబౌనట్లుగా నీని బుద్ధి

* ఉన్నగిలేని యట్టులుగ నొక్కడు జీవన మాచరింప లే
కున్నది యున్నయట్లు మరి యొక్కడు జీవన మాచరించు' నె
ద్దన్నలె' పెక్కురయ్యెడ! యథార్థవిధానము నాదరించుచున్
తిన్నగ జీవితంబు గడచేర్చెడు మానవు లెంద రుందురో!

* అయ్యాశంద మునీశ్వరుండచట శ్రీ వ్యాద్వైద భాష్యంబులో
నౌయ్యారంబులు విప్పి చెప్ప వినుచున్ వ్యుత్పన్నులై శిష్యులున్
మాయ్యారైన పురాణముల్ తెలిసి రామోదంబు పాండిత్యమున్
విద్యంబందిన తత్త్వభావములతో విజ్ఞాన సర్వస్వులై

* శ్రీ రంగేశ్వర పాద, శ్రీ రాజీనయుగళంబు శ్రీమచ్చిత్తాం
భోరుహమున నిడి గోష్ఠి ప్రారంభము సేయ నెంచె బ్రహ్మర్షి యటన్.

* అంతకుమున్ దవచ్చి విపినాంతర మానిపదాంబుజంబుల
త్యంతము గొల్చుచుండిన మహోద్యుడు ధ్వస్త సమస్త కామ భా
స్వంతుండు లేచి వచ్చి మునిపాదం దేశ ధరాతలంబు పై
ప్రాంతములందు సద్దిగొని వాలి మొయిన్ వచియించె నిట్టులన్

* శ్రీమన్మాని కలాంబుధి, సోమా! ఎనో విరామ! సురుచిరనామా!
కామక్రోధారిపు, స్తోమారగ గరుడభీమ! స్తుతగుణధామా!

* పాపంబులు తాపంబులు, కోపంబులుమీకు లేవు గురువర! వినుడీ
మాపట్టున నాకు లివవు, దీపాంతకు వచ్చినార లిడుమలం బడుచున్.

* వారలు వారిగోడు మొఱవాయి తనంబున తెల్పలేక నన్
గోరిరి వారలిక్క రిట గో! యని వారలంజూచి వారలున్
మీరిన దుఃఖ భారమున మేదినిపైంబడి ప్రొక్కి ప్రొక్కి సం
ధ్యారుణిమచ్ఛవిం బొలుచు నశ్రుల ధారల నిల్చిరచ్చటన్

[ శ్రీ వివేక చూడామణి - తెలుగు కావ్యమునుండి]

(17 వ పేజీ తరువాయి)

'గడియారం గంటలో
పదిరేయి ఫాల్గుణం ఆఖరిరోజు,
రెండు ముళ్ళు
కౌగిలించుకోగా జలదరిస్తుంది ఒళ్ళు;
అయితే అంతటితో నూతం కాలేదు
పాతవత్సరపు కడగళ్ళు
తొలినాటి ప్రతిపత్తిథి ప్రభాతకిరణం
తాళంచెవి చప్పుడు
నవవత్సరసౌధ కవాటాన్ని తెరచినప్పుడు
చేతిలో వేపప్రసాదపు వెండి గిన్నెతో
జారిపోతున్న పట్టుపైట మిసిమివన్నెతో
ఉదయానిలానికి ఆడుతున్న అలకలతో
ఒయ్యారం ఒలకబోసే నడకలతో
ఉగాది తెలుగు జవ్వని వచ్చింది
తొలిచూపులోనే లోకానికి నచ్చింది.

ఫాల్గుణ మాసం ఆఖరి రోజున గడియారం గంటలో అర్ధరాత్రి రెండు ముళ్ళు కౌగిలించుకోవడం ఎంతో లోతైన [illegible]సంయోగ ఫలితమే ఉగాది సుం[illegible]! తొలినాటి సూర్య[illegible]కిరణం తాళం చెవిగా మారి, క్రొత్తసంవత్సర సౌధకవాటాన్ని తెరగా ఆ ఉగాదిసుందరి వేపప్రసాదాన్ని వెండిగిన్నెలో పెట్టుకొని, జారిపోతున్న పట్టుపైట మిసిమి వన్నెతో ఒయ్యారం ఒలకబోస్తూ తొలిచూపులోనే లోకానికి నచ్చేలా తెలుగు జవ్వనిలా వచ్చిందనడం అపురూపమైన ఆలోచన. ఇటువంటి ఆలోచనాలోచనాలకు పేటికయైన దాశరథి కవిత్వసౌధం - తెలుగు సాహిత్య యాత్రికుల కన్నులకు మెదడుకూ ఆనందాన్ని - ఆలోచననూ రేకెత్తించే మ్యూజియం.

— ... —

# 14. త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యలు

- డా. శ్రీ ఎస్, గంగప్ప, ఎం.ఏ, పిహెచ్.డి.

తెలుగులో మహావాగ్గేయకార త్రయం త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యలు. ధాతు మాతువులకు ప్రాధాన్యమిచ్చి పద రచన చేయగలవాడు వాగ్గేయకారుడు. ఈ లక్షణానికి చక్కటి నిదర్శనం అందగినవారు త్యాగయ్య, క్షేత్రయ్య అన్నమయ్యలు. తెలుగులో పదకవిత పుట్టుక అన్నమయ్య పుట్టుకతోనే అని చెప్పడం సముచితం. ఆ వెనుక పదకవిత మూడుపూవులు ఆరుకాయలుగా వికాసం పొంది తెలుగులో తన ప్రత్యేకతను నిలబెట్టుకొంది. పదకవితా పితామహుడు అన్నమయ్య అయితే, పదకవితాజనకుడు క్షేత్రయ్య. ఆ తరువాత రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగరాజు మొదలైన వాగ్గేయకారులు ఈ పదకవితను తెలుగులో సుసంపన్నం చేశారు. మహావాగ్గేయకారులుగా నిరూపించుకొన్నారు. వీరందరిలోను - కమనీయ కవిత, పరిపూర్ణమైన భక్తిప్రవృత్తి, సరససంగీతం, అనేక మార్గాల్లో సమున్నత స్థానం ఆక్రమించిన మహావాగ్గేయకారులు త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యలు.

త్యాగయ్య కర్నూలు మండలంలోని కాకర్ల గ్రామం నుంచి తమిళ దేశానికి వెళ్ళిన ఆంధ్రబ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. తాతతండ్రులనుంచి భక్తి, సంగీత సాహిత్యాలు త్యాగయ్యకు అబ్బడంలో ఆశ్చర్యంలేదు. త్యాగయ్య తంజావూరు మండలంలోని తిరువారూరు గ్రామంలో 1767 లో జన్మించి 1847లో సిద్ధిపొందినట్లు తెలుస్తోంది. నాదోపాసనాభక్తిపరుడు త్యాగయ్య. త్యాగయ్య కృతులలో సంగీతం ప్రధానంగా, సాహిత్యం గౌణంగా ఉంటుం దన్నది పండితాభిప్రాయము. తనకృతుల ద్వారా కవిత, భక్తి, గానం అనే మూడంశాలను వరాలుగా మనకు ప్రసాదించిన మహాభక్తాగ్రేసరుడు త్యాగయ్య.

త్యాగయ్య ఏ భావాన్ని చెప్పినా అది సహజసుందరమై, అకృత్రిమంగా ఉండడం విశేషం. దీనితో ఆయన కీర్తనలకు నవ్యత, భావాలకు విలాసము, భావుకధారాళతా అలవడి శ్రోతలహృదయాల్ని ఇట్టే ఆకర్షించే గుణం తనకు తానే సంతరించుకొంది. అచంచలమూ, ప్రగాఢమూ అయినది ఆతని రామభక్తి. తన్మూలంగా ముక్తిని పొందడం ధ్యేయం. ఆత్మప్రబోధంతో సమస్త భక్తకోటికి తరుణోపాయాన్ని సూచించిన మార్గదర్శకుడు. ఎంతమంది దేవతల్ని ఆరాధించినా శ్రీరాముని పరమాత్మునిగా ఆరాధించాడు త్యాగయ్య.

'నా జీవనాధార నానోము ఫలమా ॥నా॥
రాజీవలోచన రాజరాజ శిరోమణి ॥నా॥

అని పాడినప్పుడుకాదు ఆతని శ్రీరామ భక్తి ప్రపత్తి.

'నా చూపుప్రకాశమా, నాసాసికా
పరిమళమా
నా జపవర్ణ రూపమా, నాదు
పూజా సుమమా ॥నా॥
త్యాగరాజనుత'

అని పాడినపుడు తెలుస్తుంది.

అయినా శ్రీ వేంకటేశ్వరుని ఆరాధించిన తీరును మనం ఈ సందర్భంలో స్మరించడం సముచితమే.

తెరతీయగ రాదా లోని ॥తె॥
తిరుపతి వెంకటరమణ మత్సరమను ॥తె॥
పరమపురుష ధర్మాది మోక్షముల
పారదోలుచున్నది నాలోని ॥తె॥

మత్స్యము ఆకలిగొని గాలమునే
మున్న పైకరీ తీయుచున్నది
వాగురమని తెలియక మృగగణములు
వచ్చి తగులు రీతి యున్నది
వేగమే నీ మతము ననుసరించిన
త్యాగరాజనుత మదమత్సర మను తెర
(Vol I-18)

ఇందులో లోక సహజమైన విషయాల్ని చెబుతూనే ఎంతో విశిష్టంగా తనలోని మదమత్సర మనే తెర తీయగ రాదా అంటూ శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థించడం త్యాగయ్యభక్తి ప్రపత్తితో పాటు అధ్యాత్మిక చేతనకు చక్కటి నిదర్శనం.

త్యాగయ్య నాదోపాసకుడు ఆయన కృతులన్నీ దీనికి సాక్ష్యాలే.

'నీదయచే రామ నిత్యానందుడైతి నీ
నాద బ్రహ్మానంద రసాకృతి గల నీ
(Vol II-57)

అని ప్రస్తుతించడమే గాక-

'నాద సుధారసం బిలను నరాకృతాయె
మానసా నా
వేదపురాణాగమశాస్త్రాదుల
కాధారమౌ నా

అని నాదసుధారసమే శ్రీరాముడని ఆరాధించడం అతని నాదోపాసనకు నిదర్శనం.

ఈ పదరచనలో సిద్ధహస్తుడు క్షేత్రయ్య. త్యాగయ్యకంటే వందల వత్సరాల ముందే సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యమిచ్చి, అభినయం జోడించి,పదాభినయంపట్టేపద్ధతికి మార్గదర్శకు డయ్యాడు క్షేత్రయ్య. 1590 లో జన్మించి 1675 లో శ్రీకృష్ణునిలో ఐక్యంపొందినవాడు క్షేత్రయ్య. కృష్ణా మండలం దివిసీమలోని మొవ్వ అతని జన్మస్థానం. తంజావూరు, మధుర మొదలైన రాజుల నాశ్రయించి శృంగార పద కవితలతో వారిని మెప్పించి సన్మానాలు పొందాడు. తానే చివరకు మధురభక్తి పరుడుగా మారిపోయి సర్వం మధుర భక్తి ఉన్ముఖంగా తానే నాయికయై మువ్వ గోపాలుడనే ప్రియునిపై వాలికొని నాయికానాయకులతో పదరచనలు చేసి తరించాడు. తెలుగు పలుకుబళ్ళు, నుడికారాలు, సామెతలు, ఎలుక పలుకుల తేనెలూరు తీయని తమకతానే క్షేత్రయ్య పదాల్లో చేరిపోయాయి ఇంతగా తెనుగుదనాన్ని పరిరక్షించిన కవి తెలుగుకవుల్లో లెక్కకు వస్తే ఇద్దరొక్కరే అంటే అత్యుక్తి లేదు క్షేత్రయ్య పదకవితాశిల్పి, మనోజ్ఞ పదరచనలలో క్షేత్రయ్యకు సాటి అతడే ఒక చక్కటి ఉదాహరణ.

'పల్లవి చాలుచాలు ఈచిన్నెలతో
నాకు - ఎగసక్కెలు
అ ప చాలు 'చిన్నెలు - సొగసు నా
వద్ద' మువ్వగోపాల భామవద్దకే పోర
చాలు
కన్నుల ఏడెముతో - కాటుక మోవితో
వెన్నునకీల్జడ - వేటుతోను
కన్నియ కెంపుల-గాజులనొక్కులతోను
వచ్చినావా! నుదుటను-సున్నత్తుకతోను
చాలు
నిద్దుర మబ్బుతోను - నిండు దరికతోను
ముద్దియకెకిన - ముత్యాలతోను
నిద్దంపు చెక్కిళ్ళ - నెలవంకలతోను
వద్దురాపద్దులు - వగకాడ! నాతోను
చాలు।

ఇందులోని మొదటి చరణంలోని భావాన్ని, ధ్వనిని చిత్రకారుడు చిత్రించ లేడు. కవిమాత్రం తన పదునైన మాటలతో చక్కగా చెప్పగలడు. 'కన్నుల ఏడెము, కాటుక మోవి' అనుడు ప్రయోగాలు, వినగానే ఎంతో అసహజం అనిపిస్తుంది కాని వ్యంగ్యం భావిస్తే మనోహరమూ, మంజులమూ అయిన భావం స్ఫురిస్తుంది నాయికానాయకుల పరస్పరం కన్ను ముద్దు గొన్నారన్న ధ్వని ఇందులో వుంది కళ్ళలో ఏడెమూ, మోవిని కాటుకా ఉన్నాయి. వెన్నున కీల్జడ వేటు తగిలిన గుర్తుంది కెంపుల గాజుల నొక్కులు శరీరం మీద ఉన్నాయి. అత్తుక నుదుట నున్నదట. అంటే నాయిక పాదాలకు నాయకుడు మొక్కాడన్న మాట ఇంతమనోజ్ఞంగా, భావపూర్ణంగా, వ్యంగ్యంగా చెప్పగలగడం క్షేత్రయ్య లోని గొప్పదనం

17 18 శ. లలో ఇంత ప్రసిద్ధిపొందిన తెలుగు పదకవితకు ఆద్యుడు అన్నమాచార్యుడు. 1424 లో తాళ్ళపాకలో జన్మించి 1503 లో దివ్యధామం పొందిన తాళ్ళపాక అన్నమాచార్యుడు వేనవేలు శ్రీ వేంకటేశ్వరుని ముద్రతో పదాలు రచించి, తరించాడు. భక్తులకు తరుణోపాయం చూపించాడు. తెలుగు పదకవితకు పదిహేనో శతాబ్ది వసంత కాలము. అన్నమాచార్యుని పదాలు శృంగార సంకీర్తనలు అధ్యాత్మ సంకీర్తనలు అని రెండువిధాలు. శ్రీవేంకటేశ్వరుని శృంగార లీలావిలాసాలని ఎన్నోరకాల అభివర్ణించి తానే నాయికయై, శ్రీవేంకటేశ్వరుని నాయకునిగా భావించి మధుర భక్తి ప్రపత్తిని ప్రకటించాడు. అదే రీతిగా వేదాంతపరంగా అధ్యాత్మసంకీర్తనలు రచించాడు అంటేవాస్తవానికి ప్రవృత్తిమార్గాన్ని ఎంతగా ఆయన ప్రబోధించాడో, అంతకంటే ఎక్కువగానే నివృత్తిమార్గాన్ని సైతం ప్రబోధించాడనడం సముచితం. పదకవితా పితామహుడని, సంకీర్తనాచార్యుడని, అన్నమాచార్యునకు అన్వర్థబిరుదులున్నాయి అన్నమయ్య సంకీర్తనల్లో సాహిత్యం ప్రధానంగాను, సంగీతం గౌణంగాను ఉంటుందని విమర్శకుల అభిప్రాయం అన్నమాచార్యుడు కేవలం పదరచన చేసినా పద్యకవులకు ముఖ్యంగా ప్రబంధ కవులకు తీసిపోని రీతిని, మనోజ్ఞమూ, అనన్యసామాన్యమూ అయిన భావుకతా,

చమత్కారాలతో శ్రోతల మనస్సులను చక్కిలిగింతలు పెట్టి ఆనందపరవశుల్ని చేసేట్టుగా కవిత చెప్పడం అతనికే సాధ్యమైంది. ఓ ఉదాహరణ:

'అతివ జవ్వనము రాయలనఁ
బెట్టినఁ(ట్టని) కోట
సతిమదన సుఖరాజ్య భారంబు నిలుక
॥పల్లవి॥
కాంత కనుచూపు మేఘంబులోపలి
మెఱుఁగు
కాంతుని మనంబు చీఁకటి బాపను
ఇంతి చెక్కుని వదన మింద బింబము
విభుని
చింత కనుగోయి కలువలఁ జొక్కఁ
జేయ ॥అతివ॥
అలివేణిధమ్మిల్ల మంధకారపు భూమి
కలికి రమణునకు చీకటి ముసఁగను
పొలతికి బాహువులుపూవుఁ దీగలకొనలు
నెలఁతి ప్రాణేశు వలపుల లతలఁ బెనచ
॥అతివ॥
పంకజాననరూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వరు వీరుల వెకల్లగా
జంక చూపుల చెలియచేత మదనుని చేత
యింతా వతనిని మోహించ జేయగను
(XII - 112) ॥అతివ॥

చెప్పదలచిన భావానికి అనుగుణమైన భావచిత్రకల్పనలు ఎక్కడా తడుము కోకుండా రావడం అన్నమాచార్యుని లోని మరో మహత్తరగుణం. ఇలా అన్నమాచార్యుని కవితా శిల్పానికి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చు.

ఇంతదాక త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యల కవితామాధుర్యాన్ని చవిచూశాం. ఇక వారి జీవిత స్వభావాలని, భక్తితత్త్వాదుల్ని గూర్చి కూడా క్లుప్తంగా తెలుసుకుందాం.

1. అన్నమాచార్యుడు పరమభక్తాగ్రేసరుడు. అతనిపదాలన్నీ శ్రీ వేంకటేశ్వరాంకితాలు. నరాంకితాలు కావు. సాళువ నరసింగ రాయలు తనపై పదాలు రాయమని కోరగా తిరస్కరించి శిక్షకు గురయ్యాడు. అది అతని అచంచల ప్రగాఢ భక్తి. క్షేత్రయ్యజీవితం ద్విధావిభక్తం. ఇతని జీవిత పూర్వభాగం రక్తితోను, ఉత్తరభాగం భక్తితోను గడిచిపోయినట్లు స్పష్టమవుతుంది. అంటే మొదట భోగి, ఆపైన యోగి. త్యాగయ్యజీవితం అన్నమయ్యతో పోల్చదగింది 'సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాదుతండ్రి' అని సర్వం శ్రీరామమయంగా భావించి స్మరించి తరించినవాడు త్యాగయ్య. తన అన్న అన్నమాటల్ని సైతం పెడచెవిని బెట్టి రాజసన్మానాన్ని సంపదల్ని తిరస్కరించిన మహాయోగి 'శ్రీరామ భక్తాగ్రేసరుడు.'

2. అన్నమయ్య శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. క్షేత్రయ్య కేవలం శృంగార పదాలు మాత్రమే రచించాడు. త్యాగయ్య భక్తి ప్రపత్తులతో కీర్తనలు రచించాడు. అయితే శ్రీకృష్ణపరంగా కొన్ని శృంగార విలసితమైన రచనలు లేకపోలేదు. అయితే అన్నమయ్య శృంగారం అలౌకికమై భగవత్పరకమైంది. అధ్యాత్మ సంకీర్తనల్లో భక్తి వైరాగ్యాల్ని వేదాంత రహస్యాల్ని క్రోడీకరించి చెప్పడం జరిగింది. క్షేత్రయ్య లౌకిక శృంగారంతో పాటు మధుర భక్తియుతంగా శృంగార పదరచనచేసి తన విశిష్టతని ప్రకటించాడు. త్యాగయ్య భక్తి ముక్తిదాయకమని ప్రతి కీర్తనలోను చూపించాడు. ఈ విషయంలో త్యాగయ్య అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో ఉపనిషత్సారాన్నంతటిని అందించినట్లు తెలుస్తుంది.

3. అన్నమయ్య తెలుగులోనే గాక సంస్కృతంలో సైతం పదరచన చేశాడు. క్షేత్రయ్య కేవలం తెలుగులోనే పదరచన చేశాడు. త్యాగయ్య తెలుగు, సంస్కృతం రెండు భాషలలోను కీర్తనలు రచించాడు. పల్లవి తరువాత అనుపల్లవి క్వచిత్తుగా మాత్రమే ఉంటుంది అన్నమయ్య పదాల్లో. పల్లవి, అనుపల్లవి చరణ పద్ధతిని ప్రయోగించడాన్ని ఆరంభించిన వాడు క్షేత్రయ్య. ఇదేరీతి త్యాగయ్య కృతులలోను మనం చూడవచ్చు.

4. అన్నమయ్య శృంగార పదాల్లో స్వీయ నాయికకే ప్రాధాన్యం. క్షేత్రయ్యలో స్వీయ, పరకీయ, సామాన్యల శృంగారం అభివర్ణితం. కేవలం భక్తిపరమైన పదాలే అధికం త్యాగయ్యలో. కొన్ని శృంగార పదాలు లేకపోలేదు. వాటిలో స్వీయనాయికా పరమైన శృంగారం వర్ణితం.

5. అన్నమయ్య పదాల్లోని భాషలో తెలుగుదనానికి కొదవలేదు. కాని క్షేత్రయ్య పదాల్లోని తెలుగుదనం మరింత పరిపూర్ణమై ఉంటుంది. పలుకు పలుకున తెలుగు తేట ఊటలూరు తుంటుంది. తెలుగు ఎలుకుబళ్ళు, నుడికారాలు, సామెతలు వాడి; వాటికి మనోహరత్వాన్ని ఆపాదించాడు క్షేత్రయ్య. త్యాగయ్య ఎప్పుడో తెలుగు దేశంనుంచి దక్షిణదేశం తరలిపోయిన కుటుంబంలోని వాడు కావడం వల్ల త్యాగయ్య కీర్తనల్లో ఇంత తెలుగుదనం ఉట్టి పడడం లేదుమాట వాస్తవం. దీనికి మరో కారణం కూడా లేకపోలేదు. భక్తిపారవశ్యంతో ఆశువుగా చెప్పడం మూలాన సైతం తెలుగు పలుకుల నాణ్యమూ, నాజూకుల గురించి ఆలోచించే అవకాశం లేకపోయి ఉండవచ్చు. అయితేమాత్రం సామెతలు త్యాగయ్య కీర్తనల్లో అవకాశం లేదని చెప్పడం సాహసం.

అన్నమయ్య పదాల్లో సంగీత సాహిత్యాలలో సాహిత్యానికే ప్రాధాన్యమన్న విషయం సువ్యక్తం కాని క్షేత్రయ్యలో సంగీతసాహిత్యాలకు సమప్రాధాన్యం ఉంది. పదకవితాపితామహుడని, సంకీర్తనాచార్యుడని ప్రసిద్ధికెక్కిన అన్నమయ్య తన వేలపదాల్లో వాడిన రాగాలు పరిమితములే కాని క్షేత్రయ్య అపూర్వరాగాలు వాడి, వాటికెంతో సొగసుదనాన్ని ఆపాదించినట్లు విజ్ఞుల అభిప్రాయం. ఈ సంగీత సాహిత్యాలకు అభినయం జోడించిన అభినయాగ్రయ్యగు క్షేత్రయ్య. త్యాగయ్యలో సాహిత్యం కంటె సంగీతం ప్రాముఖ్యం వహిస్తూ రాగసంపూర్ణ స్వరూపాలకు, సంగీత శిల్పానికి చక్కటి నిదర్శనం త్యాగయ్య కీర్తనలు. అనేకరాగాలను ప్రచారంలోకి తెచ్చిన ఘనత ఈతనిదే. మన సంగీతం ఈనాటికి మిగిలిందంటే త్యాగయ్య పెట్టిన భిక్ష అని మాత్రం మనం భావించడం సముచితం. అయితే ఈ పదరచన తెలుగులో ఆరంభించిన అన్నమయ్యకు తెలుగుజాతి ఋణపడిఉన్న సంగతి కూడా ఈ సందర్భంలో మరవకూడదు.

ఇలాగా అన్నమయ్య, త్యాగయ్యలు తెలుగులోని మహావాగ్గేయకారులు. అన్నమాచార్య శృంగార సంకీర్తనాంశం మూడువందల యేండ్లకు క్షేత్రయ్యగానూ, అటుతరువాత నూరేండ్లకు అన్నమాచార్యుని ఆధ్యాత్మిక సంకీర్తనాంశం త్యాగయ్యగానూ, అవతరించినట్లు శ్రీ. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భావించడం ప్రత్యక్షసత్యం!

[ఆకాశవాణి, విజయవాడ సౌజన్యంతో]

—•••—

## 15. మినీకవిత — ఒక పరిశీలన

– రచన: శ్రీ ఎస్. రాజశేఖర్, బి ఏ

ఈమధ్య మినీకవిత అనే ప్రక్రియ తెలుగు సాహిత్యలోకంలో విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది. అంతే ప్రాచీన కాలంలో 'మినీకవిత' లేకపోలేదు. అయితే - ఈనాడు దానికి బంధాలు త్రెంచి, గ్రంధాలనుంచి తప్పించి, అందచందాలు, సుగంధ పరిమళాన్ని అందించి అందరికీ అర్థమయ్యేరీతిలో, సులభగ్రాహ్యంగా, సుకుమారంగా, సుందరంగా, సుస్పష్టంగా వ్రాసేకవులు అనేకులు తయారయ్యారు. సంస్కృతంలో ముక్తకాలు, తెలుగు వాఙ్మయంలో మూడేసి పంక్తుల కందాలు, ఇవన్నీ కూడా ఈనాటి 'మినీకవిత' పరిధిలోకి వస్తాయి. ఈమినీకవితల్లో ప్రత్యేకతని అనుభూతిని అభివర్ణించడం, సామాజిక స్పృహను సంతరించి అనేక మధురమైన శిల్పాలను నిర్మించడం చూడవచ్చు. ఈ మినీకవుల భావనను, వారు వ్యక్తీకరించడానికి ప్రయోగించిన పదజాలాన్ని చూస్తే కొండంత భావాన్ని, చిన్న చిన్న నాలుగైదు పాదాల్లో ఇమిడించడం గొప్ప విషయంగా కన్పిస్తుంది, ఆశ్చర్యంతోపాటు, ఆహ్లాదం కూడా కల్గుతుంది.

ఈనాడు ఈమినీకవిత్వాన్ని ఒక విశిష్టాంశంగా భావించి అనేక పత్రికలు పతాక శీర్షికలతో ప్రచురించి యువకవుల్ని ప్రోత్సహిస్తున్నాయి. ఈ మినీకవిత ఆధునిక కవిత్వంలో ఒకభాగం. వీటిని 'బహుళార్థసాధక కవితలు' అన్నారు శ్రీ రావి రంగారావుగారు.

ఇప్పుడు 'మినీకవిత' లక్షణాలు, లక్ష్యాలు పరిశీలిద్దాము.

1 మినీకవితకు సంక్షిప్తత ప్రధాన గుణం. 2. వస్తుబంధురశైలి వుండాలి. 3 భావాధిక్యం ఉండాలి. 4 చమత్కారం, వైచిత్రి స్వయం సమగ్రంగా ఉండాలి, ఆధునిక వచనకవితలు ఏ లక్ష్యాలు నెరవేరుస్తున్నాయో ఆ లక్ష్యాల్ని మినీకవితలు నెరవేరుస్తాయి. ఇక్కడ మనం ఒకవిషయం గుర్తుంచుకోవాలి. పెద్దకవిత వ్రాయలేక మినీకవిత వ్రాస్తున్నారనీ, పెద్ద పెద్దకవితలు ప్రచురించడానికి స్థలాన్ని కేటాయించలేక చిన్న చిన్న కవితల్ని పత్రికలు ప్రోత్సహిస్తున్నాయనీ విమర్శవుంది. అయితే అదినిజం కాదు. పూర్వకవులు వ్రాసినచాటువులు, చేసున్నపద్యాలు ఏ పత్రికకోసం వ్రాశారు? మినీ కవిత తెలుగు కవితా ప్రక్రియల్లో కొత్తగాలిలా, విప్లవఝరిలా మారుతంలా పరిఢవిల్లి కొండల్ని పిండిచేయగల శక్తితో బలవత్తరకవితాశక్తిగా వచ్చిన ప్రక్రియ ఇది. మినీకవితను గూర్చి వ్రాస్తూ శ్రీ ఎల్లోరాగారు ఇలా అంటారు 'అసలు ఎంత చెప్పాడని కాదు కావ్యార్థ ధర్మం ఎం చెప్పాడు! ఏలా చెప్పాడు? అన్నదే కావ్యార్థ ధర్మం! అల్పాక్షర భావబలం, భావాధికారం, సమాహారగాహన ఉంటేకాని నాలుగుపంక్తుల్లో బాంబుల్లా పేలే మినీకవితలు వ్రాయలేరు. తగలవలసిన చోట్ల సూటిగా, ధాటిగా తగులగల రామబాణాల్లాంటివి మినీకవితలు'

అసలు చెప్పాలంటే శ్రీనాథుడినుంచి శ్రీశ్రీవరకు మినీకవిత రసప్లావితంగా, సుమనోహరంగా, భావగర్భితంగా, రంగురంగుల దుస్తులతో, సుగంధపు ముస్తాబులతో, వస్తూనే ఉంది. అయితే దానికి ఈనాడు ఎక్కడాలేని ప్రాచుర్యం ప్రాధాన్యం ఏర్పడినది. ఈ కవిత ఒక్కొక్కరి అభిరుచినిబట్టి, అవగాహననుబట్టి, ఆశయాలనుబట్టి ఒక్కొక్క విధంగా

భావం సాక్షాత్కరింపజేస్తుంది. అందరికీ ఒకేవిధంగా కాకుండా, వివిధపద్ధతుల్లో ఆలోచించడానికి, అవకాశం, ఇస్తుంది. బహుళార్థ సాధనకవిత.

ఇప్పుడు కొన్ని కవితలు మీముందుంచుతాను

"సత్తా" ఎల్లోరా

'ఎండలో బండలు కొట్టేవాడికి
సమాజం వాడి తెలుసు
సమయం కలిస్తే
బండబారిన సమాజాన్ని
బద్దలు కొట్టడం అతనికే తెలుసు.'

"బాకీ," వి భారతి

'ఆకలితో చస్తున్నా
ఆశలతో దహిస్తున్నా
బాబూ
ఒకచపాతీ ఇవ్వండి
కాదు
ఒకరుపాకీ ఇవ్వండి
తీర్చుకుంటాను
నా తరతరాల బాకీ'

'మీదిమందు' నమ్మంగి శ్రీనివాసప్రసాద్

'వృత్తికోత్యా దేవుడు
ప్రవృత్తికోత్యా యముడు.'

'నిమ్నగోవలు' మాధవీసనారా'

కీర్తిశిఖరాలు అధిరోహించేవాడికి
ఎక్కేవరకే ఆరాటం;
తీరా అక్కడికి చేరాక
యిమడలేక దిగలేక
నిరంతర జీవన-పోరాటం.

'విప్లవం' సి వి. ఎన్. శోభన్ బాబు

ఈమనుషుల కంటె
అగ్గిపుల్ల నయం;
కాలరాయాలని చూస్తే
భగ్గున ప్రజ్వలిస్తుంది

'ఇదీ సంగతి'. రమణ

నాదేశంలో
పాముల్ని పూజిస్తారు
మేకల్నిమాత్రం బలిచేస్తారు.

'టూటా' ఇ. మురళీధర్

'కాలేకడుపుల్లో రగిలేమంటల్ని
కర్మసిద్ధాంత కడలిలో ముంచేస్తున్న
పండాకోరుగ్రద్దల గుండెల్లో
టూటాసై తేలా అని వుంది'

'డబ్బు'

నువ్వు+డబ్బు=హీరో
నువ్వు-డబ్బు=జీరో
పరమాత్ముడికన్న
పైసాయే మిన్న
డెత్ఫ్ర్ మేరో యారో
దేవుడికి గోలీ మారో.

'ఎన్నియుగాలో' చల్లా రాధాకృష్ణశర్మ

జడత్వంలోంచి పశుత్వంలోకి
పశుత్వంలోంచి మానవత్వంలోకి
మానవత్వం లోంచి దివ్యత్వంలోకి
ఇంకా ఎన్ని యుగాలో.
ఎన్నెన్ని యుగాలో..

'కాగితంపులి' - ఎల్లోరా.

కాగితం పులులు
కరవడం చేతకాక
అరుస్తాయి
నీటిచుక్క మీద పడితేచాలు
తడిసి జడిసి తోకముడుస్తాయి'

'అప్పు' రత్నశ్రీ (యస్ రాజశేఖర్)

'అప్పుచేసి(చని)పోయినోళ్ళధన్యులు
తీర్చే వాళ్ళు జీవనసంగ్రామంలో
అభిమన్యులు'
[ఆంధ్రజ్యోతి సచిత్రవారపత్రిక సౌజన్యంతో]

'బెడద', రత్నశ్రీ

సంపన్నులకు పన్నుల బెడద
అపన్నులకు, సంపన్నుల బెడద'
[ఆంధ్రజ్యోతి సౌజన్యంతో]

పైకవితల్ని పరిశీలిస్తే ఒకక్రొత్తదనం, సంక్షిప్తత, ఏదో మథన, తపన, అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని ఇవ్వగల ప్రతిభ, కన్పిస్తుంది. ఈ కవితల్లో సూటిగా, నీటుగా, నేర్పుగా చెప్పే పద్ధతి వుంది.

అన్ని రంగాల్లోను ఆధునికత ప్రవేశించింది. ఈ ఆధునిక సమాజం అనేక సమస్యలమధ్య బాధలరథ్యలో పరిభ్రమిస్తోంది. ఆ బాధల్నుంచి విముక్తి, సమస్యలకు పరిష్కారం, ఆనందాన్ని అందించడం, ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం, ఆ వృద్ధివైపు పయనింపచేయడం, ఈనాటి మినీకవితల లక్ష్యాలు సునిశితమైన యథార్థాన్ని సున్నితమైన మాటల్లో, సుమనోహరమైన శైలితో, హాస్యాన్ని మిళితంచేసి, నవనవలాడిస్తూ, నవనవోన్మేషంగా, కర్తవ్యాన్ని బోధిస్తూ ప్రజల్లో ఆలోచన పెంచడం, ఈకవితల్లో కన్పిస్తుంది కొన్ని కవితల్లో అస్పష్టత ఉన్నా, అన్వయ సంక్లిష్టత ఉన్నా, అర్థంలేని వర్ణనలూ, ప్రతీకవాదాలు ఉన్నా ఎక్కువమంది కవుల కవితలు శక్తివంతంగా, ఉండి కొత్తపుంతలు త్రొక్కాయి.

పూర్వంకవిత్వం వందలకొద్దీపద్యాల్లో ఉంటే నేటి కవితలు రసస్పందనాన్ని అందిస్తూ సామాజిక విప్లవాన్ని తెప్పిస్తూ, చిన్నచిన్న పదాల్లో, ముక్తకాల్లో, సామాజిక స్పృహతో నిండుప్రతిఫలిస్తున్నాయి ప్రకాశిస్తున్నాయి ముఖ్యంగా మినీకవితలు ఆవేశంతో ఆలోచించటం, హృదయంతో స్పందించటం, సమాజాన్ని చూపటం, స్వభావాన్ని నివేదించటం, మానవత్వానికి పాంతిపట్టడం, అమాయికత్వాన్ని, అయోమయత్వాన్నీ, పరపీడనాప్రవృత్తిని ఒకటేమిటి అన్నివిషయాల్ని పరిశీలించి, సదవగాహనతో రూపొందింపబడినవి.

— .. —

# 16. శ్రీ అడివిబాపిరాజుగారి జీవితచిత్రం (1895-1952)

- శ్రీ వి. సిమ్మన్న, ఎం.ఏ., డి.ఐ ఎస్, డి ఐ హెచ్

శ్రీ అడివి బాపిరాజుగారి జీవితమంతా కళామయం. లలితకళల సమ్మేళనమే ఆయన జీవితము. కళలోనే పుట్టి కళలోనే పెరిగి కళలకు జీవిత మంకితము చేసి, కళాసేవలోనే కాలధర్మము చెందిన కళాతపస్వి 'కులపతి' శ్రీ అడివిబాపిరాజుగారు

పశ్చిమ గోదావరి మండలం భీమవరం సమీపమున ఉన్న సరిపల్లె అనుగ్రామమందు 1895 మన్మథనామ సంవత్సరము ఆశ్వయుజ బహుళ పంచమీ యామినిని శ్రీమతి సుబ్బమ్మ కృష్ణయ్య దంపతులకు జన్మించెను ఆర్వేలని యోగులు సాలంకాయన సగోత్రులు. తండ్రి కృష్ణయ్యగారు రసవత్తర మయిన కథలను ఆశువుగా అల్లి వీనులవిందుగా వినిపించుటలో ప్రజ్ఞాశాలి. అపారభక్తిశాలి తల్లి సుబ్బమ్మగారుఅమలిన హృదయ, ఉదాత్తస్వభావ. ఈలక్షణాలన్నీ బాపిరాజుగారికి ఉగ్గుపాలతో అలవడినవి. కనుకను శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు-

'మీయమ్మయేతారచాయలో నిను గాంచె
ఏయోషధుల పాలపాయసం బిడిపెంచె
లేకున్న నీశిల్ప లీలాభిరుచి రాదు
కాకున్న నీస్వాదు కంఠ మబ్బగబోదు.
అడివోరచిన్నాడ!
అపూర్వ ధారలవాడ!

అని అబ్బురపడుతూ అడివిబాపిరాజుగారిని అభినందించారు.

శ్రీ బాపిరాజుగారు నరసాపురం, బెజవాడలలో ఉన్నత విద్యాభ్యాసం చేశారు. తరువాత రాజమండ్రి చేరి ప్రభుత్వ కళాశాలాచార్యులకు ఆప్తులు జెన్నింగ్స్ (శాస్త్రి) దొరగారి శిష్యులైనాడు. దొరగారు చిత్రకారుడు. గాయకుడు. బాపిరాజుతో సహా అదే కళాశాలలో కవికొండల వెంకటరావు, దామెర్ల రామారావుగార్లు విద్య నభ్యసించారు వీరి ముగ్గురి విద్యాభ్యాసం శాస్త్రిగారి ఆధ్వర్యవములో కొనసాగింది

కవికొండలవారు కలంపట్టి కావ్య సృష్టి కావించారు. రామారావుగారు కుంచెపట్టి చిత్రసృష్టి చేశారు బాపిరాజుగారు కలం కుంచె రెండూధరించి శ్రవణానందమూ, నేత్రానందమూ కావించారు ఆధ్యాత్మిక కళాస్రష్ట అయి కళాధిదేవత ప్రాంగణములో పాటలు పాడుచు నాట్యంచేశారు

శ్రీబాపిరాజుగారు బహుముఖప్రజ్ఞాశాలి కవి, కథకుడు, ఏకాంకి రచయిత, నవలాకారుడు, చిత్రకారుడు, నాట్యాచార్యుడు, కళాదర్శకుడు, పత్రికారచయిత పత్రికాసంపాదకుడు, అధ్యాపకుడు, న్యాయవాది, దేశభక్తుడు కులపతి, కళాకోవిదుడు, కళోపాసకుడు, రసికుడు, రసజ్ఞుడు, సహృదయుడు, ఆయన్ని అన్నికళలు తమకు తామే వరించాయి ఇన్ని ప్రజ్ఞ లున్న వ్యక్తి ఏకాల మందునూ దుర్లభుడే అందుచేతనే గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు 'కళామూర్తి' బాపిరాజునుగూర్చియీలా అన్నారు - 'అచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారి అనంతరము ఆంధ్రులలో ఇన్ని ప్రజ్ఞలు కలవారులే రని చెప్పుట అతిశయోక్తి కాదు' శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు అన్నట్లు ఆయన కవేకాదు చిత్రకారుడేకాదు ఆనందమూర్తి.

గాంధీగారి పిలుపు మేరకు జాతీయోద్యమములోనికి ఉత్సాహములో ఉరికిన వారిలో బాపిరాజుగారొకరు. చిరుత వయస్సు నుండియు ఆతనిలో జాతీయ భావనలు ఏర్పడినవి. పదేళ్ళ బాలుడుగా నున్నప్పుడే బిపిన్ చంద్రపాల్‌తో కలసి స్వాతంత్ర్య సంగ్రామములో భాగస్థుడయ్యాడు.

1922 సంవత్సరములో సత్యాగ్రహ ఆందోళనలో పాల్గొని ఒకయేడు శ్రీకృష్ణుని జన్మస్థానమున కేగెను. ఈ కళామూర్తి జైలులో నుండగానే సుప్రసిద్ధ ఆంగ్లకవి బరన్స్ యొక్క గీతాలను అనుసరిస్తూ కొన్ని గీతాలను రచించి వాటిని 'తొలకరి' అన్న పేరుతో ప్రచురించారు. ప్రథమాంధ్ర సామ్రాజ్య స్థాపకు లయిన శాతవాహనుల చరిత్రకు సంబంధించిన నవల 'హిమబిందు' కూడా అప్పుడే కొనసాగించారు జైలునుంచి విడుదలయిన పిదప మచిలీపట్టణం వెళ్ళి అచ్చట ఆంధ్రజాతీయ కళాశాలలో శ్రీప్రమోద కుమారఛటర్జీ గారితో మూడుసంవత్సరాలకాలము గడిపారు. చటోపాధ్యాయుని శిష్యుడుగా ఉంటూ, భారతీయ చిత్రకళా రహస్యా లన్నీ ఆకళించుకున్నారు. భారతీయ చరిత్రయొక్క సర్వ రహస్యములను కూలంకషముగా తెలిసికొన్నారు. తరువాత మద్రాసులో బి. యల్ పట్టం పొంది, నాలుగుసంవత్సరాలు న్యాయవాది వృత్తిని చేపట్టారు. చివరకు ఆవృత్తిని విరమించుకొనిరి. 1935వ సంవత్సరములో ఆంధ్రజాతీయ కళాశాల ప్రధానాధ్యాపకత్వమును స్వీకరించినారు. ఈ పదవిలో నాలుగుసంవత్సరాలు ఉన్నారు. (1935-1939) 1939 సంవత్సరములో సినీరంగములో కళాదర్శకత్వము చేయుటానికి మద్రాసు చేరుకొని సతీఅనసూయ, ధ్రువవిజయము, మీరాబాయి' ఉత్తమమైన మూకీ చిత్రాలకు కళాదర్శకత్వము వహించి ఆంధ్రులలో ప్రథమకళాదర్శకుడు నాగల ఘనత పొందినారు, బాపిరాజుగారు మూడు చిత్రాలలోనే ఎందరో శిష్యులనుతయారు చేశారు, వారివద్ద విద్యనభ్యసించిన

ప్రముఖదర్శకులు శ్రీ వాలిశేడు, శ్రీ జి. కోటేశ్వరరావు, శ్రీ వెంకట్రావుగారు. శ్రీ జి. కోటేశ్వరరావుగారు 'పక్కింటి అమ్మాయి' శ్రీ వెంకట్రావుగారు 'వరవిక్రయం' 'చల్ మోహనరంగా' మున్నగు చిత్రాలకు కళాదర్శకత్వము వహించారు

గుంటూరులో కళాపీఠమును స్థాపించి అన్ని కళల్లోనూ అనేక శిష్యులను తయారుచేశారు. బందరు, భీమవరం, హైదరాబాదు, మద్రాసు మున్నగు స్థలములలో కళాపీఠములను స్థాపించి 'కులపతి' అయినారు శ్రీముట్నూరి కృష్ణారావుగారు ఆయనకు సమర్పించిన 'కులపతి' బిరుదమును సార్థకం చేసుకున్నారు.

మద్రాసు నుండి తిరిగివచ్చిన తరువాత మనదేశములో ఆంగ్లభాషలో ప్రచురితమయ్యే పత్రికలలో పేరెన్నికగన్న 'త్రివేణి'కి సహాయసంపాదకుడుగా పనిచేశారు. 1944 సం॥లో హైదరాబాదులో మూడు సంవత్సరాలకాలం గడిపారు (1947) పత్రికాసంపాదకుడుగా నుంటూ ఆంధ్ర తెలంగాణా ప్రజలమధ్య సన్నిహిత సంబంధాన్ని ఏర్పరచడానికి నిర్విరామ కృషిచేసినారు. వాస్తవానికి బాపిరాజుగారు అజాతశత్రువు. ఆయన మూర్తి సుకుమారం. హృదయం కుసుమకోమలము. వాక్కు నవ్యనవనీత సమానము. హైదరాబాదునుండి తిరిగివచ్చిన తరువాత కొంతకాలము విజయవాడ రేడియో స్టేషన్ ఎడ్వైజరుగా పనిచేశారు.

బాపిరాజుగారి కవితాపటిమ అపారము. వారి విజ్ఞానము సర్వతోముఖమైనది. వారిప్రతిభ బహుముఖమైనది. బాపిరాజుకవిత్వములో ప్రేమ, కరుణ, ధర్మము, శిల్పము, సంగీతము, చిత్రలేఖనము మున్నగున వన్నీ చోటుచేసికొన్నవి. కవిసమ్రాట్ విశ్వనాథ గారన్నట్లు బాపిరాజుగారికిగల భావనా పటిమ నేటికవులెవ్వరికి లేదని నిస్సందేహముగా చెప్పవచ్చు.

తెలుగుకథా సాహిత్యాన్ని తనకుగల ప్రజ్ఞావిశేషంచేత దీప్తిమంతం చేసిన ప్రతిభావంతుడు అడివిబాపిరాజు. అతి సామాన్య విషయాన్ని ఆధారంగా చేసి అనన్యసామాన్యముగా తీర్చి దిద్దగల దిట్ట చిన్నప్పటినుండియు బాపిరాజు కథలన్నచో చెవులుకోసికొనెడివారు. 60కి పైగా కథలను వ్రాసినారు ఆయన కథలలో కొన్ని 'రాగమాలిక' 'తరంగిణి' 'తూలికానృత్యం' 'వింధ్యాచలం' 'భోగిరలోయ' అనేపేర్లుగల సంపుటాలుగా వెలువడినవి. బాపిరాజుకథలు ఆంగ్ల, కన్నడ, హిందీ భాషలలోకి అనువదింపబడినవి. మాస్తి వెంకటేశం అయ్యంగార్ బాపిరాజుగారి కథలను, నేయూను పెక్కింటిని కన్నడ భాషలోకి అనువదించినారు

బాపిరాజుగారు కవి, కథకుడేకాక ఏకాంక రచనలో రేడియోప్రసారానికి అనువైన నాటికలు రచించినారు. ముఖ్యమైన కొన్ని నాటికలు 'గుడ్డిపిల్ల', 'ఉషాసుందరి', 'కృతిసమర్పణ, నవోదయా' 'ఏకవాక' 'దుక్కిటెద్దు' 'ఆంధ్ర సమ్రాజ్ఞి' 'శైలబాల' 'భోగీరలోయ' 'నారాయణరావు' వ॥

కవిగా, కథకుడుగాకంటే బాపిరాజుగారు గొప్పనవలాకారుడుగా ప్రసిద్ధుడు. నవలాసాహిత్యములో బాపిరాజుగారిది తొలిబంతిలో మొట్టమొదటిపీట ఆయన ప్రతిష్ఠకు పతాకమెత్తినది ఆయననవలలే. బాపిరాజు చారిత్రక – సాంఘిక నవలలు రచించి సవ్యసాచి యయ్యారు. 'హిమబిందు' 'గోనగన్నారెడ్డి' 'అడవిశాంతిశ్రీ' 'అంశుమతి' అనే చారిత్రకనవలలను, 'నారాయణరావు' 'కోనంగి' 'తుఫాను' 'నరుడు' 'జాజిమల్లి' అనే సాంఘికనవలలను రచించినారు. 'నా పడమటి ప్రయాణము' అనునది పరభాష నుండి వీరుచేసిన అనువాదము 'మధురవాణి' 'శిలారథం' 'కైలాసేశ్వరుడు' అసంపూర్ణనవలలుగా నుండిపోయినవి.

బహుముఖ ప్రజ్ఞాశాలియైన బాపిరాజుగారు నవలలూ, కథలూ, రేడియో నాటికలు రచించడమే కాక పాటల సంపుటాలు వ్యాసాలు రచించి ప్రచురించి తెలుగుసారస్వతానికి నూతనాలంకరణను చేకూర్చినారు

బాపిరాజుగారు వివిధ భావనలతో కల్పనలతో రూపొందించిన, ఆలపించిన, గీతాలలో కొన్ని 'శశికళ' 'గోధూళి' 'తొలకరి' 'హారతి' అనే సంపుటాలుగా వెలసినవి.

కళలలోనేకాక ఆలోపతిఆయుర్వేద వైద్యశాస్త్రములలో, సాముద్రిక జ్యోతిశ్శాస్త్రాలలో, భరతశాస్త్రములో బాపిరాజుకు అపారమయిన పాండిత్యమున్నది శ్రీ బాపిరాజుగారివలె ఇన్ని కళలలో కావ్యరూపాలలో కలం నడిపిన ధీరులు చాలాఅరుదు. ఏకకాలములో నే అన్నింటిని ప్రారంభించి ఇంద్రజాలికుని వలె నిర్వహించుట మరీ అరుదు. ఒక్కమాటలో చెప్పవలయునన్న బాపిరాజుగారు ఒకవిజ్ఞాన సర్వస్వము. ఆధునికాంధ్రసాహిత్య వైభవమును దిగంతములకు వెలార్చిన మహామనీషి. ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారన్నట్లు బాపిరాజుగారు ఒకవ్యవస్థ, ఒక సంస్థ.

ఇటువంటి మహామనీషి 1952 సెప్టెంబరు 22 వ తేదీ సాయంకాలం మద్రాసులోని రాయపేట ఆసుపత్రిలో

'సాహిత్యమృత్యుంజయా
సాహిత్యమృత్యుంజయా'

అని సంస్మరించుచు తుదిసారిగా కన్నుమూశారు.

—…—

## 17. రాజశేఖరకవి - హరవిలాసము

- శ్రీ ఇప్పగుంట సాయిబాబా.

సర్వభాషా చతురుడు, కవిరాజు అను రాజశేఖర మహాకవి (క్రీ.శ.౮౮౦ ౯౩౦ మధ్య) తొలి రచనలలో ఒకటి 'హరవిలాసము'. ఈనాడు అది నష్టమైనది.

కవినామాంకిత కావ్యములను పేర్కొనుచు శృంగార ప్రకాశము [చిత్తపః వివిక్తమాః] ... కవి భావాంకిత సమాప్తి కాశ్యత్వం స్వనామాంకితా యథా రాజశేఖరస్య హరవిలాసే అన్నది. బిల్హణుడు తన 'సూక్తిముక్తావళి'లో పేర్కొనిన రాజశేఖరుని పూర్వ కవి ప్రశంసలు 'హరవిలాస అవతారిక' లోనివేమో అని నా అనుమానము.

సరస్వతీకణ్ఠాభరణం వస్తు నిర్దేశము నకు ఉదాహరణగా ఇచ్చిన -

అస్యోద్దామ జటాభార
భ్రాన్త గఙ్గామ్బు శేఖర
అది దేవో హరోనామ
సృష్టి సంహార కారణమ్।

అను అనుష్టుప్పు హరవిలాసకథా ప్రారంభపద్యమై ఉండనోపు.

హేమచన్ద్రుడు (౧౦౮౮-౧౧౭౨) కావ్యానుశాసన వ్యాఖ్యలో సుజన దుర్జన స్వరూపం యథా హరవిలాసే -

ఇత స్తతో భషన్ భూరి
న పతేత్ పిశునః శునః
అపవాదకరయా శిక్షా
న భేదో హంసతః సతః।

అని ఉటంకించినాడు.

అమరకోశ [నామార్థ లింగమాలా] వ్యాఖ్యాతలలో ఒకడైన విద్యావినోద నారాయణుడు యుద్ధంలో పరాజితుడై పలాయితుడగు యముని వర్ణించు పద్యం ఉదాహరించాడు. ఇది హరవిలాసంలోని దని తోచుచున్నది.

అవతరతి విహాయ బ్రహ్మదణ్డం
ప్రచణ్డం సకల జనన భాజం
కల్పితాస్త్రే కృతాస్త్రే
సమర శిరసి యస్య త్రాస భంగో
ద్రుతాఙ్గ
ఖురవిధుత ధరిత్రీ చిత్రకాయో లులాయః॥

ఇంకను ఖురప్ర, ఆశి, బుధ్న, ఘున్నస అపూర్వ ప్రయోగములు చేసి, నిఘంటు వ్యాఖ్యాకారులకు చేతి నిండుగ పని కల్పించిన, ఈ మహాకవి కృతి గడచిన కాల ప్రవాహంలో కొట్టుకొని పోవుట విచారకరము.

—•••—

## 18. కవి - కావ్యము

- శ్రీ వేదాటి రఘుపతి, ఎం. ఏ.

భగవంతుని సృష్టిలో సుందరము, అసుందరమునైన వస్తు జాలము ఎంతో ఉన్నది. నిత్య జీవితములో ప్రతి మానవుడు ఈ ప్రకృతిని చూస్తూనే ఉన్నాడు. కాని కవి దృష్టి వేరు. సామాన్యుని దృష్టి వేఱు. సామాన్యునికి ఒక తీగ కనిపించితే, తీగ అనే అంటాడు దానినే కవి స్త్రీ కోమల హస్తపదములని భావిస్తాడు. ఏరులుగా ప్రవహిస్తున్న నీటిని చూసి, కవి నాయికయొక్క విరహవేదనా బాష్ప జలప్రవాహ మంటాడు. లేనిచో భగవంతుని దయారసమని ఏదో విధంగా సామాన్యుని కంటె భిన్నంగా, ఔచితీవంతంగా భావిస్తాడు, భావించిన వానిని వర్ణిస్తాడు.

ఆదికవి వాల్మీకి క్రౌంచపక్షి వియోగ దృశ్యాన్ని చూచి, అప్రయత్నంగా,

'మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమః శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక
మవధీః కామ మోహితమ్'

లయాత్మకంగా, శోకమే లక్షణాన్ని ఏర్పరచుకొని, ఆయన శోక లక్ష్యాన్ని చూపించింది. ఆశోకశ్లోకరచనే రామాయణ రచనకు పాదులు వేసింది. 'ఆత్మీకంగా హృదయము నుండి వెలువడిన వాక్ప్రవాహమే కవిత్వ మన్న వర్డ్స్ వర్తు లక్షణానికి, వాల్మీకి ఆదిశ్లోకము లక్ష్య పంక్తిలో నిలుస్తుంది.

యోగి తను అనుకున్న సమయము లోనే ఈ కావ్య ప్రపంచమును మరిచి సమాధ్యవస్థలోకి వెళ్ళి బ్రహ్మానందము ననుభవించును. కవి కూడ తాను ఒక విషయమును ఊహించినప్పుడు కాని, ఒక దృశ్యాన్ని చూచినప్పుడు కాని, దాన్ని ప్రతిబింబింపచేయు కావ్య రచన యందాసక్తుడగును. అతని ప్రయత్నము నకు ఏ లక్షణమునూ అంతరాయము కలుగదు. కలిగినా సామర్థ్యంతో సాగిపోగలడు.

ప్రతిభావంతుడగు కవి ఎట్టి వస్తువును గ్రహించినను దానిని సుందరముగా చేయగలడు వస్తువులో కొత్తదనము కాకపోయినను, కవి దానికి మెరుగులు దిద్దగలడు (ఆధునికులు కూడ కాదేది కవిత కనర్హ మని గ్రహించినారు)

అపారే కావ్య సంసారే
కవి రేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం
తథేదం పరివర్తతే ...

అపారమైన కావ్య ప్రపంచమునకు కవియే బ్రహ్మ. అతడు తన ఇచ్ఛానుసారముగా లోకమును మార్చును. అతడు శృంగారి అగుచో శృంగారమయముగా, విరాగి అగుచో విరసముగా లోకమును మార్చును. చేతనా చేతనములు కూడ కవి అధీనములోనే ఉండు నని ఆనంద వర్ధనుడు పేర్కొన్నాడు.

కవి స్వీకరింపరాని వస్తువు ఈ జగత్తులో లేదు. 'కావ్య మెల్ల వస్తువులను సుందరముగా మార్చును. అది సుందరములగు వస్తువులను సుందరతమములుగ చేయును. వికృతములను సుందరములుగా చేయు' నని షెల్లీ వివరించినాడు. కవయ తీతి కవిః తస్య కర్మ కావ్య మనుటచే కావ్యము, కవి సృష్టలోకం.

మొదట 'కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః అని కవి శబ్దము పరమాత్మ పరముగా వైదిక మంత్రములందు కనిపించును. క్రమంగా ఆ పదము పరమాత్మ సాక్షాత్కారము పొందిన 'ఋషి' పరముగా వ్యవహారమునకు వచ్చినది. సాక్షాద్దృష్టలగు వైదిక ఋషులు కవులు. వారు వెలువరించిన కావ్యము లుపనిషత్తులు. ఆద్యులగు వైదిక కవులకు, లౌకికులగు వాల్మీకి వ్యాసాదులును ఋషులగుట చేతను, దివ్య చక్షువులచే వారు లోక రహస్యములను ఎరిగిన వారగుట చేతను, లోకోత్తర వర్ణనాత్మకముగా వారి కావ్యములు ప్రభవిల్లుట చేతనే, 'నానృషిః కురుతే కావ్యమ్', అని 'కవయః క్రాంత దర్శినః' అని లోకోక్తులు ఏర్పడినవి

కేవలము ఋషులు కవులు కాలేరు. కవులు మాత్రము ద్రష్టలు, స్రష్టలును దర్శనము వర్ణనము ఈ రెండు గుణాలే కవిముఖ్య లక్షణాలు. దీనినే భామహుడు 'ప్రజ్ఞానవనవోన్మేష శాలినీ ప్రతిభామతా తదను ప్రాణనా జ్జీవే ద్వర్ణనా నిపుణః కవిః' అన్నాడు

కావ్య మీమాంసలో కవులు మూడు విధములుగా విభజించబడిరి. 1 శాస్త్ర కవి, 2 కావ్యకవి 3 ఉభయకవి. వీరిలో ఉత్తరోత్తరుడు శ్రేష్ఠుడు. ఉభయకవే విద్వత్కవి. 'విద్వత్కవయః కవయః కేవలం కవయస్తు కేవలం కపయః' అని విద్వత్కవినే ప్రశంసించి, మిగతా వారిని నిరసించినారు.

అపారమైన కావ్య ప్రపంచమును సృష్టించు సృష్టికర్త కవి. కావున 'కావ్య' లక్షణమునకు సంస్కృతాలంకారికుల అభిప్రాయాలు గమనించుట ముఖ్యం.

'శబ్దార్థౌ సహితౌ కావ్యం'

అని భామహుడు,

'గుణాలంకార యుక్తార్థౌ కావ్య'

మని వామనుడు,

'అదోషౌ సగుణౌ వనలంకృతౌ పునః క్వాపి'

అని మమ్మటుడు

'నిర్దోషం గుణాలంకార రసవత్ వాక్యం కావ్య'

మని భోజుడు

'వాక్యమ్ రసాత్మకం కావ్య'

మని విశ్వనాథుడు,

'ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్య'

మని దండి,

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య'

మని జగన్నాథుడు ఇంకను, 'కవనీయం కావ్యమని', 'లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్య, మని, ఈవిధంగా పలువురు తమతమ అభిప్రాయములు వెలిపుచ్చినారు.

పైని చెప్పబడిన నిర్వచనములన్నిటను కవికర్మ ప్రధానముగా చెప్పబడినది. మమ్మటుడు చెప్పిన లోకోత్తర వర్ణనానిపుణ కవికర్మ కావ్యమని, సారాంశము గ్రహించినచో మిగతా నిర్వచనాలు కూడ ఇందులోనే స్పష్టపడును.

'సంగీత మపి సాహిత్యమ్ సరస్వత్యాః స్తనద్వయమ్' అన్నట్లు వాగ్దేవికి సంగీత సాహిత్యములు రెండును స్తనద్వయములుగా భావిల్లును. సంగీతమునందు ఎంత మోహనశక్తి కలదో, సాహిత్యమునందు అంత ఆలోచనాశక్తి కలదు. సుమారు రెండువేల సంవత్సరముల పూర్వమే 'భరతుడు' 'నాట్యశాస్త్రము' ను రచించెను. అదియే సాహిత్య శాస్త్రమున తొలిగ్రంథమై నిలచినది. భరతునిదృష్టిలో కావ్యము లనగా నాటకాదులే. ఇతని మతమున కావ్యమునకు ఇతివృత్తము శరీరం. ఈయన రసవాది.

భరతుని తరువాత ఐదవశతాబ్దంలో భామహుడు 'శబ్దార్థౌ సహితౌ కావ్యం' అని అన్నాడు. స్త్రీ పురుషాదుల శరీర సౌందర్యమునకు అలంకారములు ప్రధానమైనట్లు, కావ్య శరీరమునకువక్రోక్త్యాద్యలంకారములు శోభనుకూర్చునని చెప్పినాడు. రసాన్ని కూడ రసవదలంకారముగా పేర్కొన్న అలంకార వాది ఇతను.

ఆరవ శతాబ్దివాడైనదండి రమణీయార్థముగు పదసంఘాతము కావ్య శరీరమన్నాడు. ఇతను గుణవాది. తర్వాత తొమ్మిదవ శతాబ్దమునకు చెందిన వామనుడు 'రీతి రాత్మా కావ్యస్య' అని సిద్ధాంతీకరించెను. రీతివాది ఇతను.

వామనుని తర్వాత సాహిత్యరంగ ప్రవేశమైన వాడు ఆనందవర్ధనుడు. ఈయన ధ్వనివాది ఇదిక్రొత్తసిద్ధాంతం. కావ్య శరీరమునకు ఆత్మ ధ్వని. అది వస్త్వలంకార రసరూపం. ఈ మూడింటిలో వస్త్వలంకార ధ్వనుల కన్నను రసధ్వని సర్వశ్రేష్ఠం.

తరువాత వచ్చిన వారిలో అభినవ గుప్తుడు, ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతమునకు 'లోచన' మను వ్యాఖ్యవ్రాసినాడు. అభినవ గుప్తుని తర్వాతి వాడయిన మహిమభట్టు ధ్వన్యాలోకమునకు ఖండనముగా 'వ్యక్తి వివేక' మను గ్రంథమును వ్రాసినను, అది నిలువలేదు.

అభినవ గుప్తుని సమకాలికుడైన కుంతకుడు, ధ్వని మతమునకు ప్రతికూలించి, 'వక్రోక్తిః కావ్యజీవిత' మ్మని భామహుని

వక్రోక్తిని కుంతకుడు విశేషముగా పెంచెను. తర్వాత క్షేమేంద్రుడు ఒకనూతన సిద్ధాంతమును ప్రతిపాదించెను. 'కావ్యమునకు జీవితభూతమైన యౌచిత్యములేనిచో అలంకారములేల? గుణములేల? అలంకారములు అలంకారములే. అనగా బాహ్యశోభా హేతువులేకాని జీవితము కాదు. శ్లేషగుణములును శ్రుత తపస్సు శీలాదుల వలెనే గుణములే అనగా అవియు జీవితము కావు. కాన రసవంతమగు కావ్యమునకు జీవిత భూతము ఔచిత్యమే' అని అన్నాడు

ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమునే తర్వాతివారెల్లరును శిరసావహించిరి.

మనవాఙ్మయము అంతా ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, కాంతాసమ్మితము అని మూడువిధాలని ఆదినుండి అభినవగుప్తాదుల అభిప్రాయములే అనుసరింపబడుచున్నవి. వేదవాఙ్మయము ప్రభుసమ్మితము. రాజువలె నిరంకుశముగా శాసించును. మనకు ఇష్టమున్నను లేకున్నను, ప్రభుశాసనము విధిగా పాటింపవలసినవిధమున వేదశాసనమును పాటింపవలయును. పురాణములు మిత్రసమ్మితములు. 'మాతా మిత్రం పితా చేతి స్వభావాత్రితయం హితమ్'. అన్ని విధముల మనమేలు కోరువారు తల్లిదండ్రులు, మిత్రుడునను మువ్వురే. లోకములో మిత్రునివలె బోధించి, ఉదాహరణలిచ్చి, కర్తవ్యధర్మాచరణమునందు ప్రవేశింపచేయును, ఇది అర్థప్రధానం.

ఇక 'కాంతాసమ్మితం' అనగా ఉత్తమురాలగు భార్య తన గుణాలంకారములచేత భర్తృమనోరంజనము చేయుచు, సన్మార్గవర్తనుని చేయువిధమున, వాచ్యరూపమున ఉపదేశింపక, గుణప్రవర్తనచే వ్యంగ్యరూపమున బోధించును. కావున కావ్యవాఙ్మయము కాంతాసమ్మితము అనుటవలన, వేదపురాణ వాఙ్మయములకన్న విశిష్టత ఈ వాఙ్మయమునకు కల్గినది. ఇందులో ఆరెండింటియందులేని చిత్తరంజన, వ్యంగ్యరూప ఉపదేశము కావ్యానికి ఉన్నతస్థానాన్ని సంపాదించిపెట్టినవి.

వైదిక వాఙ్మయము ఏ కర్తవ్య ధర్మమును నిరంకుశముగ శాసన రూపముగ బోధించునో, ఆ కర్తవ్య ధర్మమునే పురాణ వాఙ్మయము సహేతుకముగా, కథారూపంగా తెలుపును. ఈ కర్తవ్యమునే కావ్య వాఙ్మయము శైలిగుణాలంకారములచే హృద్యముగా ఉపదేశించుచున్నది

ఈ క్రమమును బట్టి చూడ కావ్యము తప్పక ధర్మమును ఉపదేశించునదిగా ఉండవలెను. ఇంకా కావ్యప్రయోజనాన్ని కావ్యప్రకాశకర్త

'కావ్యం యశసే, అర్థకృతే
వ్యవహారవిదే, శివేతరక్షతయే,
సద్యఃపరనిర్వృతయే,
కాంతాసమ్మితతయోపదేశయుజే'

అని సద్యః పరనిర్వృతిని (ఆనందమును) ఉపదేశమును కావ్య ఫలముగా పేర్కొనెను. ఈ కావ్య ప్రయోజనములను దృష్టియందు ఉంచుకొని, ఏకవియైనా, తన కవితాజగత్తున నిర్మించు కావ్య సౌధము రమణీయతరము కాగలదు. ఈ కావ్యార్థ ప్రయోజనమును గురించి ఆలోచించినపుడు, వాఙ్మయము సమాజవికాసానికి, మానవపురోభివృద్ధికి తోడ్పడుచుండునని గ్రహింపగలము.

ఉపయుక్త గ్రంథసూచి

1) కావ్యాలంకార సంగ్రహం (సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి)

2) కవి–కావ్యం– శ్రీ హెచ్. రాధాకృష్ణశర్మ.

—•••—

## 19. శాంకరీ

శ్రీ వంగర కాశీవిశ్వేశ్వర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

*అక్షిన్యార్తిఁ దలంచి కోరిడిరి నీ
కత్యంతరక్తిన్ విశా
లాక్షీ నామము కాశికాపురిని, లో
లాక్షీ! యుదేరీతి మీ
నాక్షీ నామము బెట్టిరా మధురలో
జ్ఞానేశ్వరీ! నీకుఁగా
మాక్షీ నామముఁ గంచి లోన, బహునా
మంబుల్ గదా! శాంకరీ.

*కామా! కామకలా! కటాక్షనయనా!
కాంచీలసన్మధ్యమా!
కామాక్షీ! ఘనకామకోటినిలయా!
కామేశ్వరీ! కామినీ!
కామారీ! కరుణారసార్ద్ర హృదయా!
కల్యాణీ! కాత్యాయనీ!
కామారిప్రియభామినీ! సుఖకరీ!
గౌరీ! నమశ్శంకరీ!

*గిరిజా! హైమవతీ! యుమా! గిరిసుతా!
క్లీంకారిణీ! యద్రిజా!
పరమా! పావని పార్వతీ! త్రిణయనా
పర్ణా! పరా! శైలజా!
వరదా! పుణ్యఫలప్రదా! శివసతీ!
భద్రాత్మికా! యందునా
మతిచే కీర్తినిపిల్చినన్ బలుకుమా
మాబోంట్లతో శాంకరీ!

*బ్రహ్మణీ! భువనేశ్వరీ! భగవతీ!
బ్రహ్మాండ భాండోదరీ!
బ్రహ్మోపేంద్ర సురాది వందితపదా!
రాజీవపత్రేక్షణా!
బ్రహ్మైశ్వర్య సురూపిణీ! సురనుతా!
రాజ్ఞీ! రమా! వైష్ణవీ!
బ్రహ్మానందమయీ! లలాటనయనా!
బ్రాహ్మీ! భజే శాంకరీ!

*శ్యామాభా! నిఖిలేశ్వరీ! స్తుతిమతీ!
శాతోదరీ! సుందరీ!
రామా! యింద్రధనుః ప్రభా! జయకరీ
లాస్యప్రియా! రంజనీ!

# 20. రుక్మాంగదచరిత్రము - మతము, రాజ్యాంగవ్యవస్థ

- శ్రీమతి వి. లక్ష్మిరాణి, యమ్. ఎ.

కవి యెంతకల్పనాజగత్తులో నున్నను తనకాధారమైన సమాజమును తన కావ్యములందు ప్రతిఫలింప జేయును. అట్లే ప్రౌఢకవి మల్లన విరచితమైన రుక్మాంగద చరిత్రమునందు ఆనాటి మతము, రాజకీయ విషయములు ఎట్లు చోటు చేసికొన్నవో పరిశీలింతము. పరమ భక్తుడై ఏకాదశీ వ్రతమును జరిపి ముక్తిని గాంచిన రుక్మాంగద మహారాజు చరిత్ర మిందు వర్ణింపబడినది.

మల్లన కాలమున వైష్ణవ మతము, శైవ మతము ప్రచారమునందుండెను. ముఖ్యముగా వైష్ణవమతము మిక్కిలి ప్రచారమునందు గలదు. వైష్ణవసంబంధమైన అనేక వ్రతములు నాటివారు గావించిరి.

శ్రీమాతా పరదేవతా! ద్యుతిధరా!
చిద్రూపిణీ! చిత్కళా!
కామాక్షీ! హరిణేక్షణా! సమరసా!
కల్యా! నమస్యాంకరీ!
*శ్రీకంఠార్ధశరీరిణీ! శుభకరీ!
శ్రీశైలవాసప్రియా!
ఆకర్ణాంత విశాల నేత్రయుగళా!
ఆర్యాంబికా! త్ర్యంబకా!
ఏకానంద చిదాకృతీ! మునినుతా
ఏకాక్షరీ! త్ర్యక్షరీ!
శ్రీకల్యాణ గుణాన్వితా! మధుమతీ!
జేజేలివే శాంకరీ!

[నా అద్వైతశాంకరీ శతకమునుండి, చక్కని ధార గలిగి మహాపండితుల యామోదము నొందిన యీ కేవలాద్వైత వేదాంతశతకము ప్రచారము నిమిత్తము ప్రచురింప దలచినవారికి ఇవ్వబడును. - రచయిత]

*_*

మల్లన రుక్మాంగద చరిత్రమును నిర్మింతునని తలంచిన సందర్భమున శివుడు ప్రత్యక్షమైనట్లు వైష్ణవ సంబంధమైన కావ్యమును శివకంకితమిమ్మన్నట్లు వర్ణింపబడినది.

'అర్ధనారీశ్వర స్వామి యైతనర్చు
దక్షపురి భీమలింగంబు దయఁబొసంగ
నెట్టఁగల నాకుఁ బ్రత్యక్షమైనఁ జూచి
మోద మిగుర నొ త్తపాదాబ్జములకు మ్రొక్కి.

'బంగారమునకుఁ బరిమళ
మంగీకముగాఁగఁ గల్గినట్లయ్యెను రు
క్మాంగద చరితను భీమయ
లింగం బధికాధ్రదగుట లెక్కింపంగాన్'
36 ప. 1 ఆ

అని శివుని వర్ణించెను. ఇది పరమత సహనమునకు నిదర్శనము.

మల్లన ఏకాదశీ మాహాత్మ్యమును తన కావ్యమునందు ప్రశంసించినాడు. నాడు వ్రతములలో శుభప్రదమైన సువ్రత రాజము ఏకాదశీవ్రత మనియే భావించిరి. అమితమైన పాపములను నశింపజేయునది, కఠినమైన పాతకములను బాపునది, సంసార సంతాపములను పోగొట్టునది, శుభప్రదమైనది, చిన్మయా నందము కల్పించునది ఏకాదశీ వ్రత మనియు; ఇది వైష్ణవులకు ప్రధానమైన దనియు తెల్పియుండెను.

నాటి ప్రజలు భక్తి తత్పరు లనియు వ్రతము భక్తి విశ్వాసములతో నిర్వర్తించు చుండెడివా రనియు ఈ క్రిందిపద్యము వలన ప్రస్ఫుట మగుచున్నది.

వీథుల పవరగావించి గంధంబునఁ
కస్తూరికలయంపిఁ గలయఁజల్లి
ముత్తెముల్యములముగ్గులవిచిత్రములుగా
రంగవల్లిక లేర్పడంగ వ్రాసి
మణి గాసనములఁ బ్రేమనొనర్చి గోడలఁ
జెలువారఁ గృష్ణలీలలు లిఖించి
కలువడంబులు గట్టి ఘంటాపథములందుఁ
బొడవుగా నను బట్టుపడగ లెత్తి
కదళికాతతి నిల్పి తోరణములుగట్టి
హర్మ్యముల హేమకుంభంబు లందపఱచి
'పురము రాజ్యంబు శృంగారముగ నొనర్చి
యువనినాగుండు వడిఁ దీర్థమాడి వచ్చి'
ప్ర. 118 ప.

అనగా నాడు వ్రతారంభమున రాజ్యమును శృంగారముగా తీర్చిదిద్దెడి వారనియు, వీథులందు కస్తూరి గంధమును చల్లెడి వారనియు, చిత్రవిచిత్రములైన రంగవల్లికలతో ముగ్గులు పెట్టెడి వారనియు, గోడలయందు కృష్ణలీలల చిత్రించెడి వారనియు, శుభసూచకమైన అరటిచెట్లు నుంచెడి వారనియు తెలియుచున్నది

'శమట నిస్సాణ మృదంగ భేరీశంఖ
రవములు ఘోరువ రహిఁ జెలంగ ప్ర.121ప

నాడు వ్రతారంభమున అనుంగళ ధ్వనుల వినిపించవుంచుటకై దిక్కులు పిక్కటిల్ల మృదంగ భేరీశంఖారవములు చేసెడివారు అంతేగాక భాగవత, నారసింహ, నారదీయ విష్ణుపురాణములను భాగవతులు చదివెడివారు. కర్పూరములతోను, గంధ పుష్పములతోడను, ధూపదీపములతోను, బహువస్తువులతోను, వివిధ నైవేద్యములతో విష్ణుపూజ గావించెడివారు. ఇంక అనేక వ్రతములు సల్పెడివారు కలరు.

'శ్రీలక్ష్మి నారాయణానంతోపవ మహేశ్వర కృష్ణాష్టమీ కృష్ణచతుర్దశీ చాంద్రాయణ సోమవార శనివార వ్రత పరాయణులు గలవా రని తెలియుచున్నది.

'హరిపాదభక్తి యీ
శ్వరనిందయు, శంభుచరణ సంసేవను
హరినిందయుఁ గావించిన
దురితాత్ముల లేదు దప్పఁ దొల్లి గ్రహించిన
ద్వి-26

వైష్ణవ, శైవ మతములు ప్రాచుర్యము నొందుననియు, ఇరు మతముల ద్వేషులును గల రనియు తెలియు చున్నది.

నాటి ప్రజలకు పుణ్యనదులలో స్నానమాడుట యందు, తీర్థక్షేత్రములను దర్శించుట యందు ఆసక్తి మెండు. నారదదండధరుల సంభాషణయందు అనేక పుణ్యనదులను, అనేక పవిత్రస్థలములను చక్కగా వర్ణించెను. కంచి, కుంభకోణము గంగా ద్వారము, పంచారామములు, అంతర్వేది, గయ, అహోబలము, కాశి, బ్రహ్మక్షేత్రము, శ్రీశైలము, మధుర, కోణార్క, అరుణాచలము, బదరి కాశ్రమము, హరిద్వారము, చంపకారణ్యము మొదలగు క్షేత్రములు దర్శించినట్లు తెలియుచున్నది.

వేగవతి, జాహ్నవి, 'నర్మద, తుంగభద్ర, గౌతమి, కృష్ణ, యమున మొదలగు పుణ్యనదులను వర్ణించెను. నాటి ప్రజలు భక్తితత్పరులనియు తేటతెల్ల మగు చున్నగి. రుక్మాంగద చరిత్రమువలన నాటి మత విధానము, తీర్థయాత్రలు తెలియు చున్నవి.

నాటి ప్రభువుల ధర్మములు, రాజనీతి, రుక్మాంగద మహారాజు తనకుమారుడైన ధర్మాంగదునకు బోధించిన, రాజనీతివలన తెలియుచున్నది. రాజులు ప్రజలనురక్షించుటయందును

మిక్కిలి శ్రద్ధకలవారై యుందురు. ప్రభువు నీతి నియమములతో భూమిని పాలించవలెననియు, అట్లు కాని యెడల సిరులు అతనిని విడిచియుండు ననియు, సత్య ప్రవర్తన కలిగియుండవలెననియు రాజు ఇతర రాజుల విషయంత్ర భంగులు గ్రహించి వారు పంపిన భూషణ, సుగంధాది వస్తువులను స్వీకరించవలెననియు, అట్లుకానియెడల ప్రమాదము సంభవించు ననియు మల్లన తన కావ్యమునందు వివరించినాడు.

పృ. 15, 19 ప.

నాటి ప్రభువు సప్తాంగ సహాయకుడు. రాజు, మంత్రి, కోట, భూమి, మిత్రుడు, ధనము, సైన్యము ఈ ఏడును సాటి లేని విధముగా రాజునకు రక్షణచేయు నని తెల్పెను ప్రభువు తనభూమిని, ప్రజలను, ఇతరములైనవి తెలిసికొనక మంత్రిచేతి యందు నిలిపిన ధనహాని కల్గుటయేగాక రాజ్యమును కోల్పోవుననియు మంత్రియే రాజ్యమును చేజిక్కించుకొను ననియు, అట్లుగాక రాజ్యాంగవ్యవస్థను తెలిసికొని మెలగవలెననియు తెల్పియుండెను

పృ 28 ప.

ప్రజలకు చోర భయములేకుండ తలవరులను నియమించుట కలదు నాటి కాలమున వాణిజ్యము విస్తృతముగా కొనసాగినట్లు వ్యక్తమగు చున్నది.

గోరక్షయు వాణిజ్యము
నారంభమునరియుసుంకమప్పనములు కృం
గారవనంబులు గనులును
గారణములు ధనముఁ గూర్పగానగుఁ
బతికిన్' పృ. 36 ప.

సుంకము తీసికొనెడి పద్ధతి గలదు, ప్రభువునకు ఆదాయము ఎక్కువగా నుండెడి దని తెలియు చున్నది.

రాజులు వ్యవసాయ విషయమున మిక్కిలి శ్రద్ధ వహించెడివారు.

'వివిధములగు విత్తనములు
వసలయవతి సంగ్రహించి కోరిక ప్రజకున్
వ్యవసాయబాహుళికతకై
యవిరళముగ నొసఁగవలయు నర్యో
వేశన్' పృ. 38 ప.

ప్రభువు మేలిరకములైన విత్తనములను ప్రజలకోసం సేకరించి వ్యవసాయాభివృద్ధికి బాగుగా తోడ్పడినట్లు తెలియు చున్నది.

రాజు రాజగృహమును కాపాడు రక్షకదళ ముండెడిది. శత్రుభయము లేకుండా భటులు వివిధాయుధములతో సంచరించెడివారు. రాజ్యాభ్యున్నతికి మూలబలము ఆవశ్యకము. సామంతులు నగరద్వారములను ఎల్లవేళల కాపాడవలె ననియు, అట్లుగాక ఇష్టాను సారముగా నున్నయెడల రాజు రాజ్యమును కోల్పోవుట సంభవించు ననియు తెల్పెను. శత్రురాజులు దుర్గమును ముట్టడించినపుడు రాజు తనసైన్యముతో యుద్ధమునకు తెర్పెడి వాడని రుక్మాంగదచ చరిత్రము వలన తెలియుచున్నది.

రాజాజ్ఞ ప్రజలందరకు తెలియునట్లు తలవరులచేత చాటింపు వేయించు సంప్రదాయముగల దని వ్యక్తమగు చున్నది.

'భూమిం! చాటింపగదగు
నీవసుమతిలోని ప్రజల కెల్లం దెలియన్
'అనుటయు సజ్జననాథుని
యను మతమునమంత్రి ముఖ్యులట
తలవరులన్
బనిచిరి .. ' ప్ర. 113_114 ప.

నాటి ప్రభువులకు వేటపై ఆసక్తి మెండు. రాజులకు వెంటయుండు సహాయపడుటకు చొప్పరి కాఁడు, కొండీఁడు, పులియు, మార్కోలు, గండడును మాక్షీఁగు, బఁడిమల్లడు, చిచ్చరగోల, భూతభైరవుడు, చలిపిగురు, మిత్ర మార్కుడు, తలారిలనెడి పేరులుగలవా రుండెడివారు. పృ. 69 ప.

దీనిని బట్టి ప్రభువు లాజా దేర్పఱచిన రాజ్యాంగ వ్యవస్థ మిక్కిలి పటిష్ఠమైన దని తెలియుచున్నది. ఈ విధముగా మల్లన రుక్మాంగద చరిత్రమునందు తన కాలమునాటి మత విధానమును, రాజకీయపరిస్థితులను చక్కగా వర్ణించెను.

*_*

# 21. ధ్వన్యనుకరణ శబ్దరచనా చణుఁడు - హరిభట్టు

_ కుమారి ఆర్. రమ, ఎం. ఏ.

ధ్వని యనఁగా శబ్దము, చప్పుడు అని సాధారణార్థము భాషా శాస్త్రవేత్తలు స్థాన కరణ ప్రయత్న భేదములచే గుర్తింపఁ దగిన భాషాధ్వనిని "ధ్వని" యందురు. ప్రతి ధ్వనియు వర్ణము కానవసరములేదు. కాని ప్రతివర్ణము ధ్వనియో లేక ధ్వనిసమూహమో యగును. సమాన సన్నివేశమునందు వచ్చి, విభిన్నార్థముల నీయని పద్యములలో గల వర్ణములు ప్రత్యేక ధ్వనులేకాని ప్రత్యేక వర్ణములు కావు.

ధ్వని ననుకరించుట ధ్వన్యనుకరణము. సహజముగ నున్న ధ్వనిని ఏపద మనుకరించునో దానిని ధ్వన్యనుకరణ శబ్దమందురు ఉదాహరణమునకు "గంట గణగణ మ్రోగెను" అను చోట 'గణగణ' యనునది గంట మ్రోగునపుడగు ధ్వనికను కరణము. అసలు అను కరణ వలననే భాషోద్భవము జరిగిన దని ప్రాచీనులు కొందఱు ప్రతిపాదించిరి. పశుపక్ష్యాదులు చేయు ధ్వనుల ననుకరించియు ఆయాధ్వనులతో వాయాప్రాణులను వ్యవహరించుట సాహిత్యరంగమున కూడ గలదు. ఉదాహరణమునకు తుమ్మెద, కోడి

తుమ్మెద = ఇందిందిరము, బంభరము

కోడి = కుక్కుటము.

'బంభ'మ్మని, 'దింది'మ్మని ధ్వని చేయుటచే తుమ్మెదకు బంభరము, ఇందిందిరము అను పేర్లు వచ్చినవి. 'కొక్కొ' యని కూయుటచే కోడికి కుక్కుటమని దాని ధ్వన్యనుకరణ నామ మేర్పడినది.

ధ్వన్యనుకరణ శబ్దముల నాంగ్లమున **'Onomatopoeic Words'** అందురు. అలంకారికులు సత్ఫలితముల నందుటకు ఈ ధ్వన్యనుకరణ శబ్దములను అలంకారములుగా కూర్చుట సంభవించినది.

ప్రాచీన కవి వతంసుఁడు, అష్టఘంటావధాన పరమేశ్వర బిరుదాంకితుఁడు నైన హరిభట్టారకుడు తన రచనలలో ధ్వన్యనుకరణ శబ్దములను విరివిగా ప్రయోగించెను. మత్స్య నారసింహపురాణములం దీతని ధ్వన్యనుకరణ శబ్ద ప్రయోగ సౌందర్యము నొకింత పరిశీలింతము.

హరిభట్టు నవ్వును వర్ణించు పెక్కు సందర్భములందు కలకల, కవకవ, కిక కిక యను శబ్ద ప్రయోగమును చేసెను. కృత్యాది యందు దేవతాస్తోత్ర సందర్భమున.

' కలవన్న మాత్రానఁ 'గలకల' నగుచు
నానందించు నేవేల్పు నందనుఁడు'

నార. అ 3. 8.

అనియు, ప్రహ్లాదుని కడకు దేవరాజుఁడు వచ్చి 'మీ కై నేను చేయు వలసిన దేమి?' అని యడిగిన సందర్భమున -

' .అనుడుఁ 'గలకల' నగి
యక్కొడుకు విదవరుఁ డిట్లనియె '

నార. అ 3-196

అనియు రచించెను.

పై నుదహరించిన పద్యపాదములలో నవ్వునపుడు కలుగు ధ్వన్యను కరణముగ 'కలకల' శబ్ద ప్రయోగము జరిగినది. మందహాసము చేసినచో శబ్దింపదు. 'కలకల' యను శబ్దము ఒకింత ధ్వని కలుగునట్లు నవ్వినచో కలుగును. దీనిని బట్టి మిక్కిలి సంతోషము కలిగిన సందర్భములలో బిగ్గరగా నవ్వినపుడు కలుగు ధ్వన్యను కరణ 'కలకల' శబ్దమని తెలియుచున్నది. అట్లే రాక్షసులు శివుని స్తుతించు సందర్భమున -

'కవకవ' నగుచున్న కాళికాండాష్టతుండ్'

నార. అ. 1-112.

అనియు, శ్రీహరి ప్రహ్లాదునకు హరివాసర మహిమోపేత మగు మందేహుని వృత్తాంతము నుడువు సందర్భమున -

'కాంతారై కాంత భూమిఁ
'గవకవ' నగుచున్' నార

అనియుఁ జెప్పఁబడినది.

అనియు, ప్రహ్లాదునకు
విష్ణుమూర్తిని వర్ణించు సంద
'కికకిక నగి' నార- అ. 5-

పైనుదహరించిన వాటిలో కికకిక యనునది నవ్వుట యందు కలుగు ధ్వనికి ననుకరణములు. పై సందర్భము నందలిదే

'ఇందిరాదేవి పాలయలుకల
'కిలకిలం' గలంగి' నార అ 5-86

అనునది మరియు, ప్రహ్లాదుఁడు విహారార్థము భూదోటకు పోయిన సందర్భమున -

'కంతుసేనా 'కలకలము' నాకర్ణించె
నర్మగరోత్పత్తి వీణాస్వనములు'
నార అ. 2-99 అనునది కలదు.

మన్మథుని సేనాసమూహమున పుట్టిన కలకలము (ధ్వని) నాకర్ణించిన వట వీణాస్వనములు. ఇట 'కలకలము' అను శబ్దార్థమును తీసికొనినచో 'సమూహము నందు పుట్టిన పెద్దధ్వని' యని యర్థమగును శబ్దమును గైకొనినచో 'కలకల' యనునది ధ్వన్యను కరణాభాసము.

'కలకల' యనునది నవ్వుట యందగు ధ్వన్యను కరణము మాత్రమే గాక పలుకుట యందు కూడ కానవగును.

'కలకలఁ' గేరిచిల్క పలుకం

నార. అ-1-6.

ఇట చిలుక పలుకుల యందగు ధ్వన్యనుకరణముగ 'కలకల' శబ్ద పరిగ్రహణము గావింపఁ బడినది.

జలజల ఇఁక రాలుట, ప్రవహించుట యను నర్థమున 'జలజల' యను ధ్వన్యను కరణ శబ్దమును ఈ కవి యనేక సందర్భముల సందర్భోచితముగ ప్రయోగించినాఁడు. వర్షాకాల వర్ణనమున

'జలజలఁ జలరెత్తి చా లేరు పడిరి'
నార. ఆ. 4_5.

ఇట 'జలజల' శబ్దము నీరు రేగుట ధారా పాతసందర్భమునం దగు ధ్వన్యనుకరణము.

ప్రహ్లాదునకు నారసింహుని కథ నడుపు సందర్భము నందలిది.
'జలజలఁ' జొక్కలు రాలుచు నార_ఆ_ 3_41.

మరియు, ప్రహ్లాదుఁడు శ్రీహరిపై దాడి వెడలు ప్రయత్నము నందలిగి
'చదలఁ దారలు 'జలజలన' రాల' నార. ఆ 3_151

ఇట చుక్కలు రాలుట యందగు ధ్వనికి అను కరణముగ 'జలజల' శబ్ద ప్రయోగము గావింపఁ బడినది. ఇంద్ర ప్రహ్లాదుల యుద్ధ సందర్భమున
. అలఘుతరాయుధ విఘట్టనావల కణముల్ 'జలజల' రాలగ' నార.ఆ.4 18
మరియొక తావున
జలజల విలయానలకణములు డొరఁగాన్ నార. ఆ. 4_144 అని కలవు

అగ్నికణములు రాలుటయం దగు ధ్వన్యను కరణమీ 'జలజల' గా నిచట కాన నగును.

'మిసమిస' నారసింహ పురాణోత్తర భాగపు ద్వితీయాశ్వాసమున ఋషి వర్ణన మున_
'మిసమిస' మను గండు మీను టెక్కము తోడి పువ్వారుఁదేరిపైఁ బొలుపుమీఱి'
నార. ఆ. 2_48

మత్స్యపురాణమున తులసీ మహిమా తిశయ కథనసందర్భమున నమ్మృతకలశము నందుద్భవించిన తరుణీ వర్ణన సందర్భ మున_
'కంకణ కేయూర రత్నముద్రికాముద్రితం బులై భిన్నంబులగు మిసమిస మెఱుంగుల తెలుంగునకు నెల తనంబులు గలుగుచు' మత్స్య_ ఆ 3_20. అని కలవు.

ఇట 'మిసమిస' యనునది మెఱయుట యం దగు ధ్వన్యను కరణము. కాంతిధాళ ధళ్యము నుబోధించును.

'ఘుమఘుమ' 'ఘుమఘుమ' యను శబ్దము సాధారణముగ సువాసన వ్యాపించుట యం దగు ధ్వన్యను కరణము.
'పుష్పవాసనల్, 'ఘుమఘుమా' యిత ములై గుబులు కొనఁగ' మత్స్య_ఆ_ 1_102.

కాని, కవి ఘుమ ఘుమ శబ్ద పరముగ విశేషప్రయోగము గావించినాఁడు.
'ఘుమ ఘుమ నుఱిమె దిక్కులం'
నార_ ఆ. 4_5.

వర్షాకాల వర్ణనము నందలి పద్యపాద భాగము. దీనియందు దిక్కులుఱుముట యం దగు ధ్వన్యను కరణముగ 'ఘుమ ఘుమ' శబ్దప్రయోగము గావించెను. మేఘ గర్జన భయంకరముగ నున్న దని ఇట ప్రయోగింపఁ బడిన మహాప్రాణాక్షర ప్రయోగమును సమర్థింపవచ్చును
'ధగద్ధగ' 'ధగద్ధగ' దుగ్ర కరవాలధార ..నార. ఆ. 1_150

ఇది నారదుఁడు శివునకు నారసింహుని యొక్క ప్రతాపమును తెల్పు సందర్భము లోనిది. కరవాల ధారప్రకాశమును 'ధగద్ధగ' యను ధ్వన్యను కరణముతో వ్యక్తము చేసెను. ప్రహ్లాదునకు విష్ణుమూర్తి ప్రత్యక్షమైన సందర్భమున
'ధగద్ధగని' చిగురు పసిండి కాసియ వాని కెక్కు' నార. ఆ. 5_68 అగెను.

విష్ణువుయొక్క పట్టుపుట్టపు కాంతులకు 'ధగద్ధగ' యనుధ్వన్యను కరణశబ్దత్వము నాపాదించెను

'ధళుధళుక్కు' ధళుధళుక్కు మను నది ప్రకాశమునం దగు ధ్వన్యనుకరణము. ధళధళ, ధళుక్కు ధళుక్కు, తళుతళుకులు_ ఇవియున్నియు 'మిక్కిలి భాసురము' అని తెలుపు సందర్భమునందు ప్రయోగింపఁ బడు ధ్వన్యనుకరణశబ్దములు.
'ధళుధళు'క్కంచునుగలిగి నెమ్మొగమున ముద్దాపు మెఱుగులు పిచ్చలింప'
నార_ఆ 2_32

ఇట చూపునందగు ప్రకాశమునకు 'ధళుధళుక్కు'ను ధ్వన్యను కరణశబ్ద ప్రయోగము జరిగినది.

మఱియొక్కచోటవర్షాకాల వర్ణనమున 'ధళుధళుక్కు'ననింగిదాటించెఁ బలుమాఱు, లలిత విద్యున్నటీలాస్య కేళి'
నార_ఆ. 4_6.

ధళుధళుక్కన నింగి దాటించె నని వర్ణించెను అంతియేకాక సూర్యాస్తమయాది వర్ణన సందర్భమున
'జలజరిపు పింఛావళుల తళుతళుకులు'
నార ఆ 2_149.

పైని పేర్కొనిన యుదాహరణముల లోని ధళుధళుక్కు, తళుతళుకులు అను శబ్దములు ప్రకాశమును వ్యక్తీకరించు ధ్వన్యనుకరణములు 'తళుతళుకులు' అను శబ్ద ప్రయోగ సందర్భమున ధళుధళుకు లను పాఠాంతరము కూడ కలదు. ఏశబ్దము నుగ్రహించినను మిక్కిలి ప్రకాశ వంత ములైన వనియే అర్థబోధ కలుగును.

ఇఁక వాద్యధ్వని విశేషములకగు నను కరణ శబ్దముల నెట్లు ప్రయోగించెనో చూతము

'సురదుందుభి, ధింధిమములు చెలగ'
నార_ఆ 1_212.

నారసింహ శరభ రూపధారులైన హరిహరుల యుద్ధము మాన్పవచ్చి. బ్రహ్మ వారిని స్తుతింపగా; వారుపసంహృతా యుధులయిన సందర్భములోని పై పద్య పాదభాగములు. ఇట దుందుభి యనునది వాద్య విశేషము. దానిధ్వని యందగు నను

కరణమే పై ధింధిమములు. ధణధణ యను నదికూడ వాద్య ధ్వన్యను కరణమే.

ప్రహ్లాదుఁడు స్వర్గముపై దాడి వెడలిన సందర్భమునందు.

'ధణధణంధణ' మ్రోయుతమ్మట ధ్వానంబు
బ్రయ్యలుగా మిన్ను వ్రచ్చివైచె
నార. ఆ.4.15

తమ్మట ధ్వానము మింటినే బ్రయ్యలుగా వ్రచ్చివైచె ననుటలో నాధ్వని యెంతటి భీకరమైనదో 'ధణ ధణం ధణ' యను ధ్వన్యను కరణముచే స్పష్టమగు చున్నది. ఇట నొక విశేషము గలదు. ధ్వని ననుకరించుట యనునది ఒక్కసారే కాక రెండు మూఁడుసార్లు కూడ ధ్వన్యను కరణమగుం దగును. ఇట కవి ముమ్మారు ధ్వన్యను కరణము గావించినాఁడు

'విసవిస విసరుట, త్రిప్పుట మొదలగు వానియం దగు ధ్వన్యనుకరణ మిది. ఋతు వర్ణనమున వర్షాగమ వర్ణన సందర్భమున 'విసవిస' విసరు చలిగాలులయొ ముసురు కొనిన దట ఇట విసరుట యందగు ధ్వని కనుకరణమే 'విసవిస'.

ప్రహ్లాదుం డాహ్లాద పరిపూరిత హృదయుండై విహారార్థము ముదవతీతటంబులో చేసిన సందర్భము నందలి.

'విసవిసగాక' మందగతి విభ్రమము
ల్వెలపిల్లె నర్తకిన్.
నార. ఆ. 2.114.

ఇట 'విసవిస' యను ధ్వన్యను కరణము గమన పరముగ ప్రయుక్తము. విసవిస నడచుట యనునది కోపముతోడనో, తొందరపాటుతోడనో నడచుట. ఇట విసవిసగాక మందగతి నేగనట.

'గిరగిర..' ప్రహ్లాదుఁడు శ్రీహరిపై దాడి వెడలు సన్నాహమునందు సందర్భమున
'ధరణిపల్యాణుఁ గుమ్మరి సారెయు బోలె
'గిరగిర' ముదుగ తిరుగుచుండఁగ'
నార. ఆ. 8.151.

తిరుగుటయం దగు ధ్వన్యను కరణము 'గిరగిర' యనునది.

'వెక్కివెక్కి' 'వినవచ్చె దవ్వుల
వెక్కివెక్కి యేడ్చు పరిదేవనధ్వని'
నార. ఆ. 3. 119.

ఏడ్పునందు వెక్కిలిధ్వనులె వినిపించును. ఏడ్పునందగు ధ్వన్యనుకరణము 'వెక్కివెక్కి' యనునది.

'చౌటచౌట' ప్రహ్లాదుఁడు స్వర్గముపై దాడి వెడలిన వార్త వినినయప్పటి త్రిదశేశుని యొక్క స్థితి

'అలందిన హరి చందనంబుం దొరలించి
ముంచుకొను పులివేడి
చెమటలం చౌటచౌట వడియ'
నార. ఆ. 4.35.

అనూహ్యమైన విషయ మెదురైనచో తత్తరపాటు నందుట, తత్ఫలితముగ స్వేద మంకురించుట సహజము. స్వేదజలము స్రవించుటయం దగు ధ్వన్యను కరణ మిట 'చౌటచౌట'గ రూపొందినది.

'గుభుగుభుల్లని హరిలోకాన సామజకర్ణ,
విదళనం బొనరించు రొదల గతన
నార. ఆ. 4.90.

గుభాలు, గుభిల్లు, గుభేలు, గుభులు అనునవి పడుట, పగులుట, దుముకుట, కూలుట, గుండె యదరుట మొదలగువానియం దగు ధ్వన్యనుకరణములు. ఇట ఏనుగు చెవులు కొట్టుకొను శబ్దము గుభుగుభులని శబ్దముచేయు చున్న దని వర్ణించెను. నారసింహ శరభయుద్ధ వర్ణనమున.

'పెన్నాటకమైన సేన 'పిలపిల' మనఁగా'
నార. ఆ. 1.176.

'పిలపిల' యనునది మూగుట, పోవుట మున్నగు వానియం దగుననుకరణము.

పై సందర్భము లోనిదే యగు
'భుగభుగలుగొను పెటపెటలుం,
జిటజిటలుం గలిగి విలయశిఖు లుద
యించెన్' నార. ఆ 1.190.

ప్రళయ కాలాగ్ని నిట పెటపెటలు, జిటజిట జిటలుగ నుద్భవించినట్లు ధ్వన్యనుకరణ శబ్దప్రయోగముతో వర్ణించెను.

రాక్షసమంత్రులు గావించిన రహస్యాలోచన సందర్భమున
'నిజమనంబునందు 'గుజగుజ' పోవుచు'
నార. ఆ. 2.51.

రహస్యముగ మాటాడు సందర్భమున స్వరమును తగ్గించుటచే 'గుసగుస' లేక 'గుజగుజ' యను ధ్వని యేర్పడును. దీనిని బట్టి రహస్యాలోచన చేయుటయం దగు ధ్వన్యనుకరణము 'గుజగుజ' యని తెలియుచున్నది ఇటకవి రహస్యాలోచన సందర్భోచిత ధ్వన్యనుకరణ శబ్దప్రయోగము గావించినాఁడు

ప్రహ్లాదుఁడు కాంతా సమన్వితుఁడై
సలిలకేళి సల్పు సందర్భమున
'ఘల్లుఘల్లనఁ గరకంకణ
ములు మొరయఁగ'
నార. ఆ. 2.182.

కరకంకణములు మ్రోయునపుడు కలుగు ధ్వనికి అనుకరణమే 'ఘల్లుఘల్లు' మనది.

'దినకరబింబము మిన్నున
'గనగన' యని వెలుఁగ'
నార. ఆ. 4.177.

కాలుటయందు, మండిపడుట యందును నగు ధ్వన్యను కరణము 'గనగన' యనునది. కవి ఇట సూర్యుని వెలుగు తీక్ష్ణమైనదను భావమును 'గనగన' యను ధ్వన్యనుకరణ శబ్ద ప్రయోగముచే దృగ్గోచరమగునట్లు చేసినాఁడు.

వామనుఁడు ప్రహ్లాదునకు నీత్యుపదేశము చేయుచు తనలోని దనుజాంతక శక్తి సామర్థ్యముల దెలుపు సందర్భమున

'కలనగంబులైన 'గులగులగా గెలి
చియును జాటించు' నార. ఆ. [illegible]

కలనగములైన కేలి గులగులగా విరుగబాటించు నట ఇట భావమునాశ్రయించి ధ్వన్యనుకరణ శబ్దప్రయోగము జరిగినది

ప్రహ్లాదునకు వామనుఁడు నీతిబోధఁ జేయుచుండు సందర్భమున

'విరవిరగా' కేల గాంచు విజయశ్రీలన్'

వార ఆ 3.8

త్రెళ్ళుట యందగు ధ్వన్యనుకరణముగ నిట 'విరవిర' శబ్ద ప్రయోగము జరిగినది ఇచ్చట విజయశ్రీ లోకదాని వెంటనొకటి వచ్చి యాతని చేతియందు త్రుళ్లిపడుచున్న నట

ఈ విధముగ వారి భట్టుమూర్తి క్రూ ధ్వన్యనుకరణశబ్ద ప్రయోగిమాతని రచనలో నడుగడుగున గానవచ్చుచున్నది వారి భట్టుధ్వన్యనుకరణ శబ్దప్రయోగాతి శయమున కొక యుదాహరణము

రాక్షసులు శివునిస్తుతించుచు నృసింహ రౌద్రాకారమును వర్ణించు సందర్భము నందలిపద్యము

'హాలహాలా' రవ న్రత్నా రంభరంగిమై
మేటిజిహ్వాకరాల మెఱుఁగులీనఁ
చిటచిటాగ్రభటితోఁ జెలఁగు దంష్ట్రాటంక
సంక్రత్నవహ్ని పోసనముగాఁగ
భుగభుగ' ధ్వనులతో వెగిచి మిన్నంగుచు
భూత్కార వాయువుల్పుటము లెగయఁ
'కిటకిట' చ్ఛబ్దసంకీర్ణంబులైదంత
కూటకాటికలు కోలాటమాడఁ
పద్మజాతాది సురలెల్ల భయము నొంద
నున్నవాఁడె దెవరకింపఁ దుగ్రుఁడగుచు
నతనికతమున నుద్భవం బైన సాధ్వ
సంబుదొలఁగించియుము త్రోవు చంద్రజూట

సార ఆ 1 128

హాలహాలారవము నర్తించుటకు రగ ఘలమై నృసింహుని యొక్క జిహ్వాక లెంపును లీనుచున్నది హాలహాల యను నది ప్రశంసార్థకము కోఱల రాపిడి వలన చిటచిటారభటితో నగ్ని యుత్పన్నమైన దట ఛట నగ్ని పుట్టుటను 'చిటచిట' శబ్దముతో వ్యక్తీకరించెను నిశ్వాస వాయువులు భుగభుగ శబ్దముతో వెలువడిన నట దంతముల రాపిడివలన కిటకిట శబ్దము లేర్పడినవి ఈ పద్యమునందు జిహ్వాక చేయురవమునకు ధ్వన్యనుకరణముగ 'హాలహాల' యని ప్రయుక్తమైనది 'చిటచిట' యనునది కోఱలరాపిడివలన నేర్పడిన యగ్నికి ధ్వన్యనుకరణముగ నుఁ వాయువును విడుచుట యందగు ధ్వన్యనుకరణముగ 'భుగభుగ' శబ్దమును, దంతముల రాపిడి యందగు ధ్వన్యనుకరణముగ 'కిటకిట' శబ్దమును ప్రయోగింపబడినవి

ఆయా చేష్టలను, క్రియలను వ్యక్తీకరించు నెడ వారిభట్టు ధ్వన్యనుకరణశబ్దముల నిట్లు సందర్భోచితముగ ప్రయోగించి, శబ్ద సంస్కారమెచ్చుట జాగరూకత శబ్దాలంకారములతో తనభాషాయోషను రమణీయముగ నలంకరించెను

— —

## 22. అక్షరాంజలి

– శ్రీ రామడుగు వేంకటేశ్వరశర్మ, ఎం. ఏ.

* ఆదిరాజ్మహేంద్రవర
మందు నవకవితా కు
గంధకల్హారమ్ము
పరిమళించినరోజు!
పరవశించిన రోజు!

* అది గౌతమీ కన్య
శివజటాజూటికా
భంగి నిర్గతగాంగ
ఝరివోలె నవ్యకవి
తా ప్రవంతిక యాచు
తరగలెత్తిన రోజు!
పరుగు తీసినరోజు!

* ఆదియాంధ్రభారతి
మంజు మంజీర ధ్వం
జముల నవశింజినుల
లోన ఓంకారమ్ము
కలముఎట్టిన రోజు!
కథను చెప్పిన రోజు!

* అది కదిగో! ఆంధ్రసా
హిత్య నందానిని
అవనిలోన వెలార్చి
నట్టి రెండవ భగీరథుఁడు!
నవ్యాంధ్రశబ్దానుశాసన ప్రథముఁడు!

* అదిగదిగో! ఒకరీతి
శిలిగిలిక వోలె
నున్న మన యాంధ్ర జా
తిని యూపిరులూది
అక్షరామృత భిక్ష
నిడిన సత్కవి కులేందుడు!
అటువంటి ఆదికవి భువిని ఎందుండు?

* అదిగదిగో! నట్టి నా
యిన తెలుగుజాతి కృ
తులను భారత కావ్య
లలితగీతి కల కల
నాదవేదము తోడ
పల్లవింపగ జేసి
నట్టి కవికోకిల స్వామి!
అటువంటి ఆదికవి భువిని ఎందుండు?

* అతని కవనములోన
కథలె సుధలయ్యెనో
అతని కవనములోన
సుధలె కథలయ్యెనో
సరస భారతి వెలుగ
సహృదయులకే ఎఱుక!

అతని భావనలోన
అపూర్వ శారదరాత్రు
లక్షరాక్షర రమ్య
కామార్థులై పొల్చె!

అతని భావనలోన
ఆమని లయగ్రాహి
యై పరవశముపొందె!
ప్రతిపదమ్మున రస
ప్రతిరూపమై నిల్చె!

అతని చిత్రణలోన
భరతవీరులు హైంద
వాభ్యుదయ జాతిసం
స్కృతుల శాశ్వతులైరి
ఆంధ్ర భారతికి తే
యని యలంకృతులైరి!

అట్టి కవివర్యుడెవ
రనుకొంటిరో మీరు
ఉభయభాషా కావ్య
రచనాభిశోభితుడు!
లోకజ్ఞుడు నిరంత
రామేయ జపహోమ
తత్పరుడు, సుతగుణుడు!
సత్యవాగ్విలసితుడు!
మతిబృహస్పతి అతడు!
నానాసురుచిరార్థ
సూక్తులకు నిధి అతడు!

అతడె 'నన్నయభట్టు'
అతని కృతిభారతమె
వాఙ్మయ ప్రక్రియలు
చిగురుదేసిన చెట్టు!
ఆంధ్రసాహిత్య సౌ
ధమున కదియె తొలి మెట్టు!
అర్పింతు నాకిదే
అక్షరాంజలి ఇదే!

)o(

# 23. పంప పరిచయం

- శ్రీ బులుసు వెంకటసత్యనా[illegible]ణమూర్తి,
ఎం.ఏ., ఎమ్ ఫిల్.

పంప, రన్న వీరికి కన్నడరత్నత్రయ మని పేరు. వీరిలో మొదటివాడు పంప. ఆదికవి నన్నయవలెనే కావ్యసృష్టిచేత కాకపోయినను యోగ్యతాదృష్టిచే పంప కన్నడ 'ఆదికవి'. అతడు 'కవివృషభు' డనియు కీర్తింపబడెను. 'పసరిపకన్నడక్కొడయ నొర్వనె సత్కవి పంపం' అనెడి నాగరాజుయొక్క యుక్తి అక్షరశః సత్యము. అతని కావ్యములు గతకావ్యములను మీఱియుండుటయే కాక, తరువాత వచ్చిన కావ్యములకు మార్గదర్శకములైనవి. అదృష్టవశమున పంప తన కావ్యములందు తనవంశమును గూర్చియు, తననుగూర్చియు, తనకావ్యములయందలి విషయమును గూర్చియు పూర్తి వివరములను పేర్కొనియున్నాడు. వానిసహాయమున పాఠకులు, కృతులను గూర్చియు, కృతికర్తను కృతిభర్తను గూర్చియు పూర్తిపరిచయముగావించుకొనుటకు సాధ్యమగుచున్నది.

పూర్వసముద్రతీరమునందున్న ఆంధ్రదేశమునకు చెందిన 'వెంగివళు' నందు 'వసంత, కొట్టూరు, నిడుగుంది, విక్రమపుర' అనెడి అగ్రహారము లుండెడివి. అందు అత్యుత్తముడు, ఊర్జిత పుణ్యుడు, వత్సగోత్రోద్భవుడు, నయశాలి, సకలశాస్త్రార్థమతి యగు మాధవసోమయాజి అనెడు బ్రాహ్మణుడుండెను. అతడు అనేక యజ్ఞముల నాచరించి 'సర్వక్రతుయాజి' యయ్యెను. అతని యజ్ఞకుండములనుండి బయల్వెడలిన హోమధూమము దిగ్వనితల ముఖముల నలంకరించినయుంగురులవలెను, త్రిభువనకాంత కంఠసీమకు అలంకారము వలెను శోభించుచున్నను ఆ యజ్ఞములయందు ఆహుతిగావించిన పశుహత్యాదోషముచే అతని ధవళకీర్తి కళంకిత మాయె నని కవి ప్రకటించెను. అతని కుమారుడు 'అభిమానచంద్ర'. ఇతడు యాదవులు యాచించిన సమస్తవస్తువులను వేరు యోచనలేకుండ సమర్పించి గుణముల పురుషోత్తముని మీఱెను. భువనవిఖ్యాతుడగు అభిమానచంద్రుని కుమారుడు 'కొమరయ్య'. ఈతడును వేదవేదాంగ పారగుడు, పూతచరిత్రుడు. అతనికి గుణమణి రత్నాకరుడు, అజ్ఞానతమోనాశకరుడునగు 'అభిరామదేవరాయుడు' కుమారుడు. ఈతనికే 'భీమపయ్య' అనియు పేరు. ఈతడే పంప జనకుడు. జాతులలో ఉత్తమజాతియగు విప్రకులమును, ధర్మములలో ఉత్తమ ధర్మమగు జైన ధర్మముచే మరింత ప్రకాశవంతము గావించినా డని ఈతడు కీర్తింపబడినాడు పంపతల్లి 'అణ్ణిగేరి'కి చెందిన 'సింఘన' జోయిసయ్యని కుమార్తె యగు 'అబ్బణబ్బె'. పంపకు 'జినవల్లభు'డను నాకసోదరుడును కలడు. ఇతడును పంపవలెనే కవియు, పండితుడునయి యుండెను. 'వెంగివళు' తెలుగుదేశమునందలి ఒక భాగమే యయినను, అతడు ఆ ప్రాంతమునకు చెందిన, అన వెంగిమండలము నందలి, వేములవాడ చాళుక్యుల ఆశ్రయమునందున్నను పంపతల్లి పుట్టినిల్లు 'అణ్ణిగేరి' కన్నడదేశమునం దుండుటచే మొదటినుం

డియు కన్నడ భాషతో సన్నిహిత సంబంధము కలిగియుండెను.

పంప దుందుభి గంభీరనినదుడు, దుందుభి సంవత్సరోద్భవుడు. అంతియేకాక

కదళీగర్భ శ్యామం
మృదుకుటిల శిరోరుహం, సరోరుహ
వదనం,
మృదుమధ్యమతను హితమిత
మృదువచనం, లలిత మధురసుందర వేషం
వత్సలతిలకన్, అభిజన
వత్సలన్, అభిమానమూర్తి,సకలవిద్యాకోవి
దత్సరన్, అమృతమయోక్తి శ
రత్సమయ సుధాంశువిశదకీర్తివితానం'

పంప లలితాలంకార ప్రియుడు, రసికుడు, రూపవంతుడు, స్వాభిమాని అని తెలియుచున్నది. నేను వనితాకటాక్ష వశులయ వనచంద్రుడ ననియు, కేరళ ఐటీకటీ మాత్రారుణమణి ననియు, మలయ, ఆంధ్రయువతుల స్వరూపము సకలమోహకపడి నాకస్వాధీనల యిరనియు నిస్సంకోచముగా చెప్పుకొనియున్నాడు. స్త్రీలావణ్యము నందున్న ఆకర్షణలోని లోగుట్టు అతనికి తెలియును. ఆ కారణము చేతనే అతడు తన కావ్యమునందు 'సారం అనంగ జంగమ లలితాంగి యుతింతములై సంసారం' అనియుద్ఘోషించి యున్నాడు. సంసార సారోదయుడగు అతనికి భోగసామగ్రి లగు స్నానము, అనులేపనము, పుష్ప ధారణము, భోజనము, తాంబూలచర్వణము, దుకూల ధారణము, వనవిహారము, జలక్రీడాది సమస్త విషయములందును అత్యధిక మగు అనుభవమును, రసికతయు కలవని స్పష్టముగ తెలియుచున్నది. ఈ అనుభవముయొక్క వైభవమును చూడ వలయును 'ఆదిపురాణము' నందలి పదునొకండవ ఆశ్వాసమునందు వచ్చెడి భరతచక్రవర్తియొక్క చైత్రయాత్రాసందర్భమునందు. అయినను తంపసభోగముల యొక్క మితియును, త్యాగముయొక్క హితవును చక్కగా తెలియును. ధర్మార్థకామముల పరిమితిని అతడు స్పష్టముగ గుర్తించెను. దానినే అతడు ఈ రీతిని స్పష్టపరచియున్నాడు

'ధర్మం ప్రధానం, అర్థం
ధర్మాంఘ్రిప ఫలం, అదర్కె రసమను
కామం'

పంప బాల్యమును గూర్చిన వివరము లేమియు తెలియవు. ఈతని విద్యాభ్యాసము సర్వతోముఖమయి యుండవలెను. రామాయణ, మహాభారతముల అటులనే జైన ధర్మగ్రంథముల పరిచయము అతనికి విశేషముగానుండెను. ప్రాకృత, సంస్కృత భాషలయందు విశేషపాండిత్య ముండెను. సంగీతము, నృత్యము, శిల్పము, వైద్యము, అర్థశాస్త్రము, కామశాస్త్రము, నీతిశాస్త్రము మొదలగునవియు అభ్యసించియుండును. ఈతని గురువు కొండకుందాన్వయమునకు చెందిన 'దేవేంద్రముని'. ఈతని యందు పంపకు అధికమగు భక్తి. అందువలననే అతడు తనను 'ఆదిపురాణము' నందు 'దేవేంద్ర మునీంద్రవంద్యపరమ జినేంద్ర ముఖ చాన్ద్రోంద్రికా ప్రసర ప్రసాదోదీర్ణ సూక్తికల్లోల మాలాకీర్ణ కవితాగుణార్ణవం' అని చెప్పుకొనియున్నాడు. ఈ దేవేంద్రముని 'శ్రావణబెళగొళ' యందుండినట్లు శాసనాధారములవలన తెలియుచున్నది. పంప 'వెంగిపళు' నుండి వచ్చి యుచట ఈగురువుల పాదపద్మముల చెంత విద్యాభ్యాసముగావించి యుండును. ఈసమయమునందే అతనికి 'కోగిలె యాగి, వేణి పుల్లె దుంబి యాగి పుట్టువుదు నందనదొళ్ బనవాసిదేశద్', అని పలుకిరుల అతడు ప్రశంసించిన బనవాసీ దేశ సంబంధము కలిగియుండును

పంపయొక్క విద్యావైదుష్యముచే ఆకర్షితుడైన, నాటి వేంగి మండల పశ్చిమభాగమందలి, కన్నడప్రాంతమగు, 'లెంబుళపాటక' మను పట్టణమునందు రాజ్యము చేయుచున్న రాష్ట్రకూటరాజుల మాండలిక్కుడగు సామంతరాజగు 'అరికేసరి' పంపను తన ఆస్థానమునకు ప్రేమతో పిలిపించుకొని, విశేషముగ మన్నించి, అతని గ్రంథములను స్వీకరించి పంచరత్నములను, పలుకానుకలను, ధర్మపురమను అగ్రహారమును సమర్పించి సన్మానించెను అంతియేకాక తన 'గుణార్ణవ' బిరుదమునకు సరితూగునట్లు అతనికి 'కవితాగుణార్ణవ' బిరుదునిచ్చెను అతని ఆశ్రయమునందు పంప ఆత్మతృప్తికొలకును, ధర్మపరిహారముకొలకును శకవర్షం 863 నకు సరిపోవు ప్లవ సంవత్సరమునందు తన 39వయేట అనగా క్రీ.శ.941లో యుందు ప్రశస్తమగు తిథివార నక్షత్రములతో కూడిన శుభముహూర్తమునందు ఆదితీర్థంకరుని చరిత్రయగు 'ఆదిపురాణము' ను రచించెను. అదిపూర్తిగావించిన వెంటనే తన ఆశ్రయదాత కీర్తిస్థాపనకొరకు 'విక్రమార్జునవిజయము' లేదా 'పంపభారతము' అనెడి మరియొక గ్రంథమును రచించెను. ఒకటిమూడు నెలలయందును, వేరొకటి ఆరు నెలలయందును రచించితినని కవియే చెప్పెను ఒకదానియందు జైన ధర్మమును వేరొకదానియందు లౌకిక ధర్మమును చెప్పియుండెను

— —

# 24. శేషమువారి శశాంకుడు

– శ్రీ ఎ. క్రిష్ణప్ప, బి.ఎస్‌సి., ఎం.ఏ.

దక్షిణాంధ్రయుగ కవులలో చెన్నుడగినవాడు విజయ రంగచొక్కనాథుని సంస్థాన కవులలో ప్రముఖుడు, ఉభయ భాషాకవితా విశేషుడు, శేషము వేంకటపతి ఈతడు 'శశాంకవిజయ' మను కావ్యమును వీర శృంగార భరితముగ రచించి విజయరంగ చొక్కనాథుని మంత్రియగు వంగల సీనయామాత్యుని కంకితము చేసెను. శేషము వేంకటపతి- కృష్ణయార్యుని పుత్రు డనియు, కందాళ రామానుజ శిష్యు డనియు ఆశ్వాసాంత గద్యలవలన తెలియుచున్నది. సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు శేషము వారిని 'దక్షిణాదిపెద్దన' అని చెప్పియున్నారు.

శేషము వేంకటపతి సజీవపాత్రచిత్రణములో సిద్ధహస్తుడు. శశాంకవిజయమును నాటకీయముగా రచించి యుండుటచే పాత్రలచిత్తవృత్తులు విపులముగ చిత్రీకరింపబడినవి. కావ్యకథాకథనముగూడ సంభాషణరీతిలో వ్రాసెను. శశాంకవిజయము అయిదు ఆశ్వాసముల శృంగారభరిత ప్రబంధము. ఈ ప్రబంధమువందు తార, శశాంకుడు, త్రిమూర్తులు, బృహస్పతి, అత్రి, అనసూయ, ఇంద్రాదిదేవతలు, నారదుడు మొదలయిన పాత్రలు గలవు ఈపాత్ర లన్నింటిలోను తారాశశాంక పాత్రలు ముఖ్యమైనవి, శేషము వేంకటపతి తారాశశాంకపాత్రలను తీర్చిదిద్దుటలో జూపిన నేర్పు అద్వితీయమైనది. శశాంకునిపాత్ర శేషము వేంకటపతి ప్రతిభకు ప్రతీక అనిపించును అత్రి అనసూయలకు త్రిమూర్తుల అంశతో పుత్రత్రయం కల్గుతుంది. వారు దత్తాత్రేయ,దుర్వాసన, శశాంకులు. శశాంకుడు బ్రహ్మఅంశతో బుట్టినవాడు. శశాంకుడు విద్యనభ్యసించుటకు బృహస్పతి వద్దకు వెళ్ళుట, బృహస్పతి భార్యయైన తార శశాంకుని అందాన్ని చూచి వలచుట, తారాశశాంకుల ప్రేమకు చిహ్నముగ బుధుడు జన్మించుట, జరిగిన విషయమును ఇంద్రునకు బృహస్పతి విన్నవింపగా ఇంద్ర చంద్రాదులకు యుద్ధము జరుగుట, చివరగా బ్రహ్మ బుధుని చంద్రున కిచ్చి తారను బృహస్పతి కిచ్చునట్లు న్యాయము చెప్పి, వారి కయ్యమును మాన్పింప జేయుట యిందలి యితివృత్తము.

బ్రహ్మ అంశతో 'కాంతా మోహన చాతుర్య రుచిరేఖాపాంగునిం జంద్రునిఁ' అత్రి గనెను. బాలచంద్రుని అందచందము లీ విధముగ వర్ణింపబడినవి.

'కలువల చెలికాడు, కళల కెల్లను పీడు
  కౌస్తుభము నేస్తకానికిని తోడు
రాతిరియేలికవాడు, జోతి యుండెడివాడు,
  మగువల దమిగొల్పు మాయలాడు
జక్కవగమినూడు, చక్కనివగకాడు
  చిమ్మచీకటి నెమ్ము ద్రిమ్మరీడు
మరుని వశీరుడు, మెఱ నీటుగలవాడు
  ముద్దుగుమ్మల మొగమ్ములకు నీడు
అంకమున జింక దాల్చిన యందకాడు
అంబుజాక్షుని మోహంబుటన్న తోడు
సద్విజన్ముల బ్రోచు వజ్రంపు జోడు
కలిక తనమున మెఱయు చుక్కలకు
  రేడు.' (1-38)

శశాంకుని అందము బాల్యమునందే యిట్లుండ,యౌవనవంతుడైనప్పటి యతని అందము నూహింపకలవియున్నది. ఇంత అందముగనున్న బాలచంద్రునకు బ్రహ్మ యిచ్చిన వరము యిది.

'ఈత డనిఁ సురాసురుల
  కేని యుగెల్వగరాని విక్రమ
ఖ్యాతిని మించి, రా జనగ
  నంచిత కీర్తి వహించి, తారకా
నేతయు, నోషధీశు, డన
  నీ సురజాతికి బాలకుండునై
భూతల మేల, మేలు తల
  పోయును, జేయును రాజనాయముల్.'
(1-42)

చతుర్ముఖు డొసగినపైవరములు 'శశాంక విజయము'న జరుగబోవు కథను సంక్షిప్తముగ దెల్పుచున్నవి. ఈ వరములలో 'తారకానేత' గాగలడనియు సూచింపబడుచున్నది శశాంకుడు బృహస్పతివద్ద అన్ని విద్యలను నేర్చుకొని 'బహువిధ రత్న నిధానంబగు జలధి' వలె తయారయ్యెను శశాంకునకు యౌవనోదయశోభ అలముకొన్నది. 'కేల నొక్కనం జక్కని పాలు గాఱు నును చెక్కులు, సంతగ మొగ్గ యందముల్' చేరుకొన్నది. శశాంకుని శోభను బృహస్పతి భార్యయైనతార ముగ్ధురాలైనది. శశాంకుని శృంగారచేష్ట లతో సరసపు మాటలతో నాకట్టుటకు యత్నించినది తార తారకలపు శశాంకుని 'కలవున డాపక తోడ్తోవులాడినది' శశాంకుడు తార అందమును కన్నుల పండువుగా జూచి కాముకరవకుడై 'వేలంపుటన్నులయందైన దీని యందము గలదే' అని భావించినాడు. అయినా శశాంకుడు తెగించి తారను చేర్చుకొనలేదు. దీనికి కారణము, శశాంకుని మనస్సునందు కలిగిన భావమును రమ్యముగ క్రింది పద్యమునందు శేషమువారు చూపియున్నారు.

'చెంతఁ దనంత నింతికడు
  నేరక నేయగ సంతసంబునఁ

గంతుడు రంతో నర్వఁ బర
 కాంత యటంచు, నధర్మమంచు, లో
కొంతయుఁ జింతఁ గొందు, మన
 సిట్టులు గొట్టుక నాడు, సాహసం
బింత, భయంబొకింత, రుచి
 యింత, యసమ్మతియింత గన్పడన్'
[2-90]

శశాంకుని మనస్సు పూర్తిగా తారపై లగ్నమైనది. తారను 'గూడిన తనువు తనువు' అని భావించియు అత్మలో నిట్లు నిశ్చయించుకొనెను

'తలపగ సాహసంబు, తలి
 దండ్రులు విన్నను తాళ రీగురుం
డలిగిన మోస, మింద్రు హృద
 యంబునకు న్వాలి యౌను, నందుపై
బాలతుల నమ్మకూడ దెటు
 పోయెటులౌనొకో? యిదేల? తానె యీ
చిలుకలకొల్కి బల్కి దయ
 జేసిన జాల, మటంచు ధీరతన్'
(2-108)

బృహస్పతి చంద్రుని కార్యనిమిత్తము పిల్చుచు, భార్య తారను 'చంద్రుని కంటికి రెప్పవలె కాచుకొ'మ్మని చెప్పెను. తారకు చంద్రునిపై నున్న ప్రేమను బయటకు వ్యక్తము చేయుటకు సమయము వచ్చినది. చంద్రు డీసమయమును గురించి ఎదురు చూచుచున్నాడు. బృహస్పతి వెళ్ళిన తర్వాత తార శశాంకుని మితి మీరిన శృంగార చేష్టలతో, ధ్వనిగర్భితమైన పలుకులతో నాకట్టుకొనుటకు ప్రయత్నించును. అయినను శశాంకుడు బింకములో నుండెను. చివరికి తారయే శశాంకు డున్నచోటికి విలాసభాసురాంగియై వెళ్ళినది. శశాంకుడు తార సర్వాంగసౌందర్యమును గాంచి, పులకించియు మదిలో 'నీమె ఎందుకిక్కడికి వచ్చియుండు' నని తలంచి 'కళంకముల నమ్మరాదుగా కలనైనన్'అని భావించెను. శశాంకుడు తారపైనున్న ప్రేమను వ్యక్తముచేయక, తన తప్పు ఉండకూడదని కాబోలు తారతో నిట్లనును.

'ఇదియేమి? యిచ్చటి కేల వచ్చితివి? నీ
 కింటం బనుల్లేవె? యి
ప్పుడు పాపా! పతి యూరలేనియెడ నీ
 పల్కోపె శృంగారముల్
నుడుగుల్సేయుదురే? రహస్యమున ని
 చ్చోఁ జేరి నాచెంతనుం
డెద, విట్లుండిన లోకు లారకయ సం
 దేహింపరే చూచినన్. (3-58)

శశాంకుడు లోకులకు భయపడితారను తనదరినుండి వెళ్ళిపొమ్మన్నాడు. ఇప్పుడు తారాశశాంకుల సంభాషణము మొదలైనది. ఈ సంభాషణము వరూథినీ ప్రవరుల సంభాషణమును దలపింప జేయుచున్నది వరూథిని వలె తారయు తన ప్రేమను బయలు చేయును. 'కంతు బారికి లోబడ గాని వారు ధరలో గలరే' అని చెప్పి తార శశాంకునిపై నుంచిన మోహము నెప్పటినుండి యెట్లు దాచినదో చెప్పివైచెను తార పల్కులు వినిన శశాంకుడు కొంతసేపు గుండె ఝల్లనగ నచ్చెలు వొందెను. 'వనితల భావముల్ తెలియవచ్చునె?'యంచు దలంచి తారకు హితపదేశము చేయ ప్రయత్నించెను.' నీకిది యెంతటి తగువే? పాలవంటికుల మీవు జనించినదొట'అని చెప్పి భయపడు చేమోయని యిట్లు చెప్పి చూచును.

'ఓర్వరు బంధుజాలు, మడ
 కొత్తున నొత్తును మామగారిదే
పర్వినమాత్రపంట పవ
 బట్టును బావ, మగండటంటి మా
దుర్వహరోష భీషణతి
 దోడ్తొ చంపగ జూచు, గావునన్
సర్వవిధంబుల న్నలికి
 జార సమాగము కాంతు చెల్లునే'
(3-56)

శశాంకుని పల్కులు తారకు భయపెట్టలేదు. పైగ చిఱునవ్వు గల్గించినవి. తార చంద్రునకు కాముకీధర్మములనోపన్యాసము చేసెను. 'నారీకుచా భోగ భోగానందైక రసంబె బ్రహ్మ'- అని వేదాంతమును, పరోపకారః పుణ్యాయ' అని నీతిని తెలిపెను తార వేదాంతపు పల్కులు వరూథిని పలికిన 'ఆనందో బ్రహ్మ' అను వేదాంతపు పల్కులను తలపించును. 'పెంచితి బెద్ద జేసితి' నని 'నిన్ను గూడుటకు మాకు స్వతంత్రము లేకపోయెనో' అని తార పలుక శశాంకుడు 'సురేంద్రగునకున్ గురుపత్నివై జగత్పావన కీర్తిగాంచితివి. పాడియె నీ కిటువంటి పోడుముల్' అని తార స్థానమును గుర్తుచేయును. తార దీనికి సమాధానముగ శశాంకుని బంధువులు చేసిన తప్పులను బయటపెట్టును. శశాంకుని ప్రియగురువైన బృహస్పతికే యొసరు పెట్టెను. 'వగినెయంచు నొకింత వావిలేకయె జ్యేష్ఠు పెలతతో బొందడె నీ గురుండు?' అని వాగించెను

శశాంకు డెన్నివిధాల వద్దని చెప్పినను తార అన్ని విధాల సమాధాన పరచినది. చివరికి తార తాళలేనని 'యికమాటలు పల్కవల దంచును' 'పైబడి కౌగిలించును' శశాంకుడుకూడ పరవశు డయ్యెను. శేషము వేంకటపతి పెద్దనవలె శృంగ భంగముచేయలేదు. ఇంతవరకు వచ్చిన దానిని మార్చుట కిష్టము లేకపోయినది. పెద్దన ఒకనాటి సంఘటనమున వరూథిని ప్రవరుని వలచినది కాని శేషమువారి తారాశశాంకు లిరువురు కొంత కాలమునుండి ఒకరినొకరు వలచిన వారే. అందుకే శేషమువారు వారిని విడదీయలేదు. పెద్దన నిజప్రవరుణ్ణి వరూథిని నుండి విడదీసినా గంధర్వుని మాయాప్రవరునిగా జేసి వరూథినితో కలిపెను. వరూథినికిమాత్ర మీ విషయము తెలియదు. పెద్దనకావ్యమున వివాహితుడైన ప్రవరునితో కన్యయైన వరూథిని కాము

(తరువాయి 4౬ వ పేజీలో)

# 25. సమాలోచన చతుర్థ సంపుటము రచనల అకారాది పట్టిక

(37 వ పేజీ తరువాయి)

కాంక్షకు దిగును. శేషము వారికావ్యమున వివాహితయైన తార పెళ్ళికాని యువకుని తో ప్రేమకు దిగును.

బృహస్పతి ఇంద్రుని కార్యమును ముగించుకొనివచ్చి తారాశశాంకుల ప్రేమ కలాపము గాంచి, రచ్చకెక్కుట కిష్టము లేక శశాంకుని గురుకులమునుండి విద్య పూర్తి అయినట్లు చెప్పి పంపివైచెను శశాంకుడు తారశృంగారచేష్టలనుమదిలో మరవక, విరహమును ధరించలేక, తార తనచెలి చేత పంపిన సందేశము నదనుగా తీసికొని తారను లేవుకొని వచ్చెను బృహస్పతి శశాంకుడు తారను తీసుకొని పోయినట్లు ఇంద్రునికి తెల్పెను ఇంద్రాదులకు చంద్రునకు యుద్ధము జరగను చంద్రుడు తారకొరకు ఇంద్రునితో యుద్ధము చేయుటకు కూడ వెనుకాడ లేదు చివరికి బ్రహ్మ ఇచ్చిన తీర్పునకు శశాంకుడు శిరసావహించి బుధుని తానుంచుకొని తారను బృహస్పతి కప్పగించెను

ఈ విధముగ శశాంకుని పాత్రను శేషము వేంకటపతి సర్వాంగ సుందరునిగా, తార సౌందర్యానికి ముగ్ధుడైనను తన ప్రేమను వ్యక్తముచేయని వానినిగా, తార శశాంకుని వలచి వచ్చితినని చెప్పినను హితోపదేశము చేసి, మరలి వెళ్ళునట్లు చేయుటకు ప్రయత్నించు వానినిగా, తారను మరువలేక, విరహము ధరించలేక తారకొరకు ఇంద్రునితో యుద్ధముచేయుటకు కూడవెనుకాడని వానినిగా, వీరపురుషునిగా, తీర్చిదిద్దెను. శశాంకవిజయము 'బ్రహ్మవ్రాతకు తిరుగువ్రాత లే దను' సూక్తిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. కథ అంతయు బ్రహ్మ యిచ్చిన వరములతో జరిగిన దని చెప్పవచ్చును.

— • • —

# 26. రాజమంద్రి నామచర్చ

## 'రాజమంద్రి' ప్రాచీనతమనామము 'రాజమహేంద్రపురము' 'రాజమహేంద్రి' కాదు. రాజమహేంద్రి భ్రష్టరూపము.

- డా॥ శ్రీ కొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పిహెచ్.డి

కొంత కాలముగా మన ఊరి నామమును పునరుద్ధరించుటకని ఆందోళనము జరుగుచుండుట, ఎల్లరకు తెలిసినదే

ఆ నామము 'రాజమహేంద్రి' అని కొందఱును, 'రాజమహేంద్రపురము,' 'రాజమహేంద్రవరము,' 'రాజమహేంద్రము' అని మఱికొందఱును వివిధముగా పేర్కొనుచున్నారు.

తమ తమ నామములనుగూర్చి వారు వారు చెప్పుయుక్తులను నిశితముగా పరిశీలించి, ఏది యుక్తిసహమో సహేతుకముగా నిర్ణయించుటయే ఈ వ్యాసము పరమోద్దేశము

దానిలో 'రాజమహేంద్రి' అను నామమును మొదట పరిశీలింతము.

'రాజమహేంద్రి' అను పేరు Cunningham అనునతఁడు రచించిన 'Ancient Geography of India' అను గ్రంథములోనున్నది ఆ గ్రంథము ననుసరించియే తరువాతి చారిత్రకులు మఱికొందఱు తమ తమ గ్రంథములలో ఆ నామము స్వీకరించిరి. 'అట్లానుకూడ దాని ననుసరించియే 'రాజమహేంద్రి' ని గ్రహించినది కొన్ని Encyclopaedia గ్రంథములలోని 'రాజమహేంద్రి'కిఁ కూడ అదియే ఆధారము, ఆ గ్రంథము అన్నియు మన యూరికిఁ 'రాజమహేంద్రి' యను పేరు క్రీ.శ 975 నుండి కలదని చెప్పుచున్నవి అది క్రీ. శ. 975కు పూర్వమున యూరి పేరు ఏమయినదియు ప్రస్తావించుటలేదు. 'రాజమహేంద్రి'కాదుల కదియేమూలము.

అయిన, Cunnigaham గ్రంథమున మొదట 'రాజమహేంద్రి' ఉండుటకు కారణమేమో విచారింపవలయును మనదేశమును దర్శించిన చైనాయాత్రికులు తమతమ గ్రంథములలో వ్రాసిన దానిని Cunningham తన గ్రంథమున స్వీకరించెను కొందఱు విదేశీయులు మన యూరి పేరిని 'రాజమహేంద్రి' యని తప్పుగా నుచ్చరించి, తదనుగుణముగా వర్ణక్రమము కూర్చుకొని వ్రాసిన దానిని మఱియొక విదేశీయుఁడు (Cunningham) ప్రమాణముగా గైకొని తన గ్రంథమునఁ జూపుచో, అది మనకు ప్రమాణమా?

ప్రస్తుత 'రాజమంద్రి' యను దానికి పూర్వరూపము 'రాజమహేంద్రి' అను నది యనియు, అది క్రమముగా నుచ్చారణమున భ్రష్టమై యిప్పటి 'రాజమంద్రి' అయినదనియు వారు చూపు నింకొక యుపపత్తి. అందుచే 'రాజమంద్రి' కి 'రాజమహేంద్రి' యే ప్రాచీననామ మని వారి వాదము నిజమే, భాషాశాస్త్రాను సారముగా 'రాజమహేంద్రి' 'రాజమంద్రి' యగుట సులభమే. ఎవ్వరును కాదనరు. కాని 'రాజమహేంద్రి' నుండియే కాక, 'రాజమహేంద్ర' నుండియు 'రాజమంద్రి' యేర్పడుటకు భాషాశాస్త్రసమ్మతి లేక పోలేదు. రెండు పక్షములయందును 'హ' కారము లోపించినది. ఇక 'రాజమహేంద్ర' నుండలి తుది అకారము విశ్రుతియం దికారమైనచో 'రాజమంద్రి'

సిద్ధింపఁగలదు. ప్రకృతి యందలి తుది అకారము వికృతియందు ఇకార మగుట కలదు. 'నిశా' యను అకారాంత ప్రకృతి 'నిసి' యని వికృతిలో ఇకారాంతముగా మాఱుటలేదా? అందుచే 'రాజమహేంద్రి' నుండి వలెనే 'రాజమహేంద్ర' నుండియు 'రాజమంద్రి' సిద్ధింపవచ్చును.

ఇఁక రాజమహేంద్రి వాదులు బెంగుళూరు to రాజమండ్రి రైల్వే టిక్కెట్టుపై కన్నడభాషలో 'రాజమహేంద్రి' యని యుండుటను చూపుచు, మనయూరి పేరింకను కన్నడములో 'రాజమహేంద్రి' గనే యున్న దనియు, అందుచే అదియే ప్రాచీన మఱియు నిజమైన దని చూపుచున్నారు పరిశీలించినచో అదియు నిలుచునట్టిది కాదు. 'రాజమహేంద్రి' యని యున్నది కన్నడ భాషలో తెలుగులోఁ గాదుకదా! అది తెలుఁగులో అకారాంతముగానే యుండవచ్చును. తెలుఁగు 'నన్నయ' లోని నన్న కన్నడమున 'నన్ని' అనియు, అదియే 'నన్నె చోడుఁడు' లో నన్ని అనియు నైనది. అట్లే 'రాజమహేంద్రశబ్దము కన్నడ వ్యవహారమున 'రాజమహేంద్రి' యని యేర్పడి యుండవచ్చును. కన్నడ వ్యవహారము తెలుఁగునకుఁ బట్టించుట సముచితము గాదు.

ఊరిపేర్ల విషయమున కేవలశబ్దసాధుత్వ విచార మంతముఖ్యముకాదు. వానిలో నెన్నియో వైరి సమాసముగా నున్నవి కలవు. ఉదాహరణమునకు విజయవాడ, మహేంద్రవాడ మున్నగు నూర్ల పేర్ల సాధుత్వ మంగీకార్యము కాదుగదా. వానిని కేవలం సంజ్ఞావాచకములుగా యథాతథముగా గ్రహింప వలయును. అందుచే రాజమహేంద్రి వాదులు రాజమహేంద్రి శబ్దమున కేదో విధముగ శ్రమపడి వ్యాకరణ సాధుత్వము నాపాదింపఁ గలిగినను, తత్ స్వీకారయోగ్యత కదియే ప్రధానము కాదు. గ్రామనామ పునరుద్ధరణమునకు తన్నామ ప్రాచీనత అతి ప్రధానముగాని, తచ్ఛబ్దసాధుత్వ మొక్కటే యెంత మాత్రమును కాదు కదా. అందుచే రాజమహేంద్రి శబ్దసాధుతా విచార మిట అసంగతము, అనావశ్యకము నయి, వృథాప్రయాస మగుచున్నది.

మఱి 'రాజమహేంద్రి' మన యూరి ప్రాచీననామము కానప్పుడు, ఇఁకేది?

మన యూరి ప్రాచీననామము 'రాజమహేంద్రపురము' ఆదికవి మన నన్నయ భట్టారకుఁడు ఆదిపర్వమున 'వేంగీ దేశంబునకు నాయకరత్నంబునుం బోని 'రాజమహేంద్ర పురంబునం' దని స్పష్టముగా వాడి యున్నాఁడు 'రాజమహేంద్రుఁ' డనునది తూర్పుచాళుక్య ప్రభువుల బిరుదనామము. ఈ పురమును నిర్మించినవాఁడైన మొదటి యమ్మరాజ విష్ణువర్ధనుఁడు రాజమహేంద్ర బిరుద విరాజితుఁడు అతఁడు తన పూర్వ రాజధాని యగు వేంగీపురమును విడిచి, గోదావరీ నదీ తీరమున నొకపురమును నిర్మించి దానిని తన బిరుదముపేర 'రాజమహేంద్రపుర,' మని పిలిచెను. దీనికి **History of the Eastern Chalukyas of Vengi** అను గ్రంథము రచించిన సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారి మాట లెంతయు నుపబలకము లుగా నున్నవి చూఁడుడు.

**'Thus it would appear that Vishnuvardhana Ammaraja I was compelled in the beginning of his reign to remove his residence and the seat of his operations to a safe and distant place and then carry on the war against his opponents who apparently destroyed the capital of his father or forefathers. It is, therefore, likely that the king founded the new city on the northern bank of the Godavari (A D. 919-20) and called Rajamahendrapura after his biruda Rajamahendra, like his ancestor, Mangi Yuvaraja who built the city of Vijayawada after his second name Vijayaditya roughly three centuries ago Hence forward, Rajamahendrapura became the official residence of the kings and the capital of the country. The Andhra Mahabharata composed during the eleventh century at Rajamahendrapura(modern Rajamahendri or Rajahmundry) calls the illustrious city 'Nayaka ratna' the 'Central gem'of the Vengimandala Page 234.**

**Ammaraja I came to the throne early in A. D 919, if not a few months earlier, i e, in December A D 918, and reigned for seven years till the end of A. D. 925. And, if we accept the ancient tradition, the city of Rajamahendrapura must be taken to have been found immediately the King had ascended the throne in or about**

(87 వ పేజీ తరువాయి)

శాంభవి దిగుడు శేషము వారికావ్యమున వివాహితయైన తార పెళ్ళికాని యువకునితో ప్రేమకు దిగుట

బృహస్పతి ఇంద్రుని కార్యమును ముగించుకొనివచ్చి తారాశశాంకుల ప్రేమ కలాపము గాంచి, రచ్చకెక్కుట కిష్టము లేక శశాంకుని గురుకులమునుండి విద్య పూర్తి అయినట్లు చెప్పి పంపివైచెను శశాంకుడు తారశృంగారచేష్టలనుమదిలో మరవలేక, విరహమును భరించలేక, తార తనచెలి చేత పంపిన సందేశము నదనుగా దీసికొని తారను లేపుకొని వచ్చెను బృహస్పతి శశాంకుడు తారను తీసుకొని పోయినట్లు ఇంద్రునికి తెల్పెను ఇంద్రాదులకు చంద్రునకు యుద్ధము జరిగెను చంద్రుడు తారకొరకు ఇంద్రునితో యుద్ధము చేయుటకు కూడ వెనుకాడ లేదు చివరకు బ్రహ్మ యిచ్చిన తీర్పునకు శశాంకుడు శిరసావహించి బుధుని కానుంచుకొని తారను బృహస్పతికి అప్పగించెను

ఈ విధముగ శశాంకుని పాత్రను శేషము వేంకటపతి సర్వాంగ సుందరునిగా, తార సౌందర్యానికి ముగ్ధుడైనను తన ప్రేమను వ్యక్తముచేయని వానినిగా, తార శశాంకుని వలచి వచ్చితినని చెప్పినను హితోపదేశము చేసి, మరలి వెళ్ళునట్లు చేయుటకు ప్రయత్నించు వానినిగా తారను మరవలేక, విరహము భరించలేక తారకొరకు ఇంద్రునితో యుద్ధముచేయుటకు కూడ వెనుకాడని వానినిగా, వీరపురుషునిగా, తీర్చిదిద్దెను. శశాంకవిజయము 'బ్రహ్మవ్రాతకు తిరుగువ్రాత లేదను' నానుడిని జ్ఞప్తికి తెచ్చుచున్నది. కథ అంతయు బ్రహ్మ యిచ్చిన వరములతో జరిగిన దని చెప్పవచ్చును.

— • —

# 26. రాజమండ్రి నామచర్చ

**'రాజమండ్రి' ప్రాచీనతమనామము 'రాజమహేంద్రపురము' 'రాజమహేంద్రి' కాదు. రాజమహేంద్రి భ్రష్టరూపము.**

- డా॥ శ్రీ కొన్నలగడ్డ మృత్యుంజయరావు, ఎం.ఏ., పిహెచ్ డి.

కొంత కాలముగా మన ఊరి నామమును పునరుద్ధరించుటకని ఆందోళనము జరుగుచుండుట, ఎల్లరకు తెలిసినదే

ఆ నామము 'రాజమహేంద్రి' అని కొందఱును, 'రాజమహేంద్రపురము,' 'రాజమహేంద్రవరము,' 'రాజమహేంద్రము' అని మఱికొందఱును వివిధముగా పేర్కొనుచున్నారు.

తమ తమ నామములనుగూర్చి వారు వారు చెప్పుయుక్తులను నిశితముగా పరిశీలించి, ఏది యుక్తిమంతో సహేతుకముగా నిర్ణయించుటయే ఈ వ్యాసము పరమోద్దేశము

దానిలో 'రాజమహేంద్రి' అను నామమును మొదట పరిశీలింతము.

'రాజమహేంద్రి' అను పేరు Cunningham అనునతఁడు రచించిన 'Ancient Geography of India' అను గ్రంథములోనున్నది ఆ గ్రంథము ననుసరించియే తరువాతి చారిత్రకులు మఱికొందఱు తమ తమ గ్రంథములలో ఆ నామమునే, స్వీకరించిరి. 'అట్లాసు'కూడ దాని ననుసరించియే 'రాజమహేంద్రి' ని గ్రహించినది కొన్ని Encyclopaedia గ్రంథములలోని 'రాజమహేంద్రి'కిఁ గూడ అదియే ఆధారము, ఆ గ్రంథము లన్నియు మన యూరికిఁ 'రాజమహేంద్రి' యను పేరు క్రీ. శ. 975 నుండి కలదని చెప్పుచున్నవి అది క్రీ. శ. 975కు పూర్వమునుండ యూరి పేరు ఏమయియుండెడిదియు ప్రస్తావించుటలేదు. 'రాజమహేంద్రి'వాదమున కదియేమూలము.

అయిన, Cunnigaham గ్రంథమున మొదట 'రాజమహేంద్రి' ఉండుటకు కారణమేమో విచారింపవలయును మనదేశమును దర్శించిన చైనాయాత్రికులు తమతమ గ్రంథములలో వ్రాసిన దానినే Cunningham తన గ్రంథమున స్వీకరించెను కొందఱు విదేశీయులు మన యూరి పేరిని 'రాజమహేంద్రి' యని తప్పుగా నుచ్చరించి, తదనుగుణముగా వర్ణక్రమము నేర్పఱచి వ్రాసిన దానినే మఱియొక విదేశీయుఁడు (Cunningham) ప్రమాణముగా గొంచి తన గ్రంథమునఁ జూపుచో, అది మనకు ప్రమాణమా?

ప్రస్తుత 'రాజమండ్రి' యను దానికి పూర్వరూపము 'రాజమహేంద్రి' అను నది యనియు, అది క్రమముగా నుచ్చారణమున భ్రష్టమై యిప్పటి 'రాజమండ్రి' అయినదనియు వారు చూపు వింతైన యుపపత్తి. అందుచే 'రాజమండ్రి'కి 'రాజమహేంద్రి' యే ప్రాచీననామ మను వారి వాదము నిజమే, భాషాశాస్త్రానుసారముగా 'రాజమహేంద్రి' 'రాజమండ్రి' యగుట సులభమే. ఎవ్వరును కాదనరు. కాని 'రాజమహేంద్రి' నుండియే కాక, 'రాజమహేంద్ర' నుండియు 'రాజమండ్రి' యేర్పడుటకు భాషాశాస్త్రసమ్మతి లేక పోలేదు. రెండు పక్షములయందును 'హ' కారము లోపించినది. ఇంక 'రాజమహేంద్ర' మందలి తుది అకారము వికృతియం దికారమైనచో 'రాజమండ్రి'

సిద్ధింపఁగలదు. ప్రకృతి యందలి తుది అకారము వికృతియందు ఇకార మగుట కలదు. 'నికా' యను అకారాంత ప్రకృతి 'నికి' యని వికృతిలో అకారాంతముగా మాఱుటలేదా? అందుచే 'రాజమహేంద్రి నుండి వలెనే 'రాజమహేంద్ర' నుండియు 'రాజమండ్రి' సిద్ధింపవచ్చును.

ఇఁక రాజమహేంద్రి వాదులు బెంగుళూరు to రాజమండ్రి రైల్వే టిక్కెట్టు పై కన్నడభాషలో 'రాజమహేంద్రి' యని యుండుటను చూపుచు, మనయూరి పేరింకను కన్నడములో 'రాజమహేంద్రి' గనే యున్న దనియు, అందుచే అదియే ప్రాచీన మరియు నింకొకయుక్తిని చూపుచున్నారు పరిశీలించినచో అదియు నిలుచునట్టిది కాదు. 'రాజమహేంద్రి' యని యున్నది కన్నడ భాషలో తెలుఁగులోఁ గాదుకదా! అది తెలుఁగులో అకారాంతముగానే యుండవచ్చును. తెలుఁగు 'నన్నయ' లోని నన్న కన్నడమున 'నన్ని' అనియు, అదియే 'నన్నెచోడుఁడు' లో నన్ని అనియు మైనది. అట్టే 'రాజమహేంద్రశబ్దము కన్నడ వ్యవహారమున 'రాజమహేంద్రి' యని యేర్పడి యుండవచ్చును. కన్నడ వ్యవహారము తెలుగునకుఁ బట్టించుట సముచితము గాదు

ఊరిపేర్లవిషయమున కేవలశబ్దసాధుత్వ విచార మంతముఖ్యముకాదు. వానిలో కొన్నియో మైరి సమాసముగా నున్నవి కలవు. ఉదాహరణమునకు విజయవాడ, మహేంద్రవాడ మున్నగు నూర్ల పేర్ల సాధుత్వ మంగీకార్యము కాదుగదా. వానిని కేవల సంజ్ఞావాచకములుగా యథాతథముగా గ్రహింప వలయును. అందుచే రాజమహేంద్రి వాదులు రాజమహేంద్రి శబ్దమున కేదో విధముగ క్రమపడి వ్యాకరణ సాధుత్వము నాపాదింపఁ గలిగినను, తత్ స్వీకారయోగ్యత కదియే ప్రధానము కాదు. గ్రామనామ పునరుద్ధరణమునకు తన్నామ ప్రాచీనత అతి ప్రధానముగాని, తత్సాధుత్వ మొక్కటే యొంత మాత్రమును కాదు కదా. అందుచే రాజమహేంద్రి శబ్దసాధుతా విచారమిట అసంగతము, అనావశ్యకము నయ్యె, వృథా ప్రయాస హేతువగును

మఱి 'రాజమహేంద్రి' మన యూరి ప్రాచీననామము కానప్పుడు, ఇఁకేది?

మన యూరి ప్రాచీననామము 'రాజమహేంద్రపురము' ఆదికవి మన నన్నయ భట్టారకుఁడు ఆదిపర్వమున 'వేంగీదేశంబునకు నాయకరత్నంబునుం బోని 'రాజమహేంద్ర పురంబునం' దని స్పష్టముగా వాడి యున్నాఁడు 'రాజమహేంద్రుఁ' డనునది తూర్పుచాళుక్య ప్రభువుల బిరుదనామము ఈ పురమును నిర్మించినవాఁడైన మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుఁడు రాజమహేంద్ర బిరుద విరాజితుఁడు అతఁడు తన పూర్వరాజధాని యగు వేంగీపురమును విడిచి, గోదావరీ నదీ తీరమున నొకపురమును నిర్మించి దానిని తన బిరుదముపేర 'రాజమహేంద్రపుర' మని పిలిచెను. దీనికి History of the Eastern Chalukyas of Vengi అను గ్రంథము రచించిన సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారి మాట లెంతయు నుపబలకములుగా నున్నవి చూడుఁడు.

'Thus it would appear that Vishnuvardhana Ammaraja I was compelled in the beginning of his reign to remove his residence and the seat of his operations to a safe and distant place and then carry on the war against his opponents who apparently destroyed the capital of his father or fore fathers. It is, therefore, likely that the king founded the new city on the northern bank of the Godavari (A D. 919-20) and called Rajamahendrapura after his biruda Rajamahendra, like his ancestor, Mangi Yuvaraja who built the city of Vijayawada after his second name Vijayaditya roughly three centuries ago Hence forward, Rajamahendrapura became the official residence of the kings and the capital of the country. The Andhra Mahabharata composed during the eleventh century at Rajamahendrapura(modern Rajamahendri or Rajahmundry) calls the illustrious city 'Nayaka ratna' the 'Central gem'of the Vengimandala Page 234.

Ammaraja 1 came to the throne early in A. D. 919, if not a few months earlier, i e , in December A D 918, and reigned for seven years till the end of A. D 925. And, if we accept the ancient tradition, the city of Rajamahendrapura must be taken to have been found immediately the King had ascended the throne in or about

A. D. 919-20, and probably completed in the next few years, if not in the next following reigns.

The ancient city of Rajamahendrapura was built on the western slopes of the huge rock on the left bank of the river Godavari The site was apparently selected on account of its strategic situation The rock appears to have had three or four peaks, overlooking the river, and which have become sanctified by the popular imagination and establishment of temples on them in course of time These sacred peaks are known as Pushpagiri, Kamalachala ahd Vedadri None of these are seen to the present day as they were buried under the sands of the river deposited during the last century, since the days of the destruction of the outer walls of the city. *Page 238-239*

The actual moment of his (Raja Raja's) Abhisheka or anointment was in the Vanija lagna which fell between 8 and 9 a. m in the lumar month Sravana at Rajamahendrapura Page 337.

పయి చారిత్రకాధారములవలన మన యూరి ప్రాచీననామము A. D 919 నుండియు 'రాజమహేంద్రపుర' మని స్పష్టపడుచున్నది. అది A. D. 957 తరువాత విదేశీయుల యుచ్చారణమున 'రాజమహేంద్రి' గా భ్రష్టమయి యుండును అది యపభ్రంశరూపమగుట చేతనే, ఆకాలమునకు అర్ధశతాబ్దము తరువాతివాడైన, మన నన్నయభట్టారకుడు, రాజమహేంద్రపుర వాసి ఆ 'రాజమహేంద్రి' నామమును స్వీకరింపక, తన యాంధ్ర మహాభారతమున 'రాజమహేంద్రపుర, మని మే పేర్కొనినాడు 'రాజమహేంద్రి' యే పూర్వనామమైన యెడల ఛందోనిర్బంధమే మాత్రమును లేని గద్యవాక్యమున 'రాజమహేంద్రిపుర' మనియే వాడి యుండవచ్చును గదా!

'రాజమహేంద్ర కవీంద్ర సమాజ సురక్ష్మాజ' అనుపద్యమునను 'రాజమహేంద్ర కవీంద్ర' యని ప్రయోగించుట యీ పురముపేరు 'రాజమహేంద్ర మని చాటుచున్నది అంతేకాక 'రాజమహేంద్రి కవీంద్ర' యనుచో నను ప్రాసము దెబ్బతిని, నన్నయ కిష్టమగు తక్షగరమ్యతి చెడిపోవు ప్రమాద మేర్పడును.

అందుచే మన యూరి ప్రాచీన నామము 'రాజమహేంద్రి యెంతమాత్రమును గాదనియు, 'రాజమహేంద్రపుర' మనియు ననుట చారిత్రకాధారమును బట్టియు, సారస్వతాధారమును బట్టియు సిద్ధాంత మని చెప్పవచ్చును.

'రాజమహేంద్రపురము' కవులచే రాజమహేంద్రముగాఁ గూడఁ బ్రయుక్తమైనది పేరిలో నేకదేశమును ఆ మొత్తము పేరిగ్రహింపవచ్చును గదా! నామైకదేశే నామగ్రహణమ్' అని యున్నదికదా! 'రాజమహేంద్రము' శాసనముల వాడుకలో 'రాజమంద్రం' 'రాజమండ్రం' అయినది. కనుకనే మూలము 'రాజమహేంద్రి' యెంతమాత్రమును గాదనుట సుస్పష్టము.

'రాజమహేంద్ర పురము' శ్రీనాథుని నాఁటికి 'రాజమహేంద్రవరము' గా మార్పుచెందినది. 'సాంద్ర విభవంబు' రాజమహేంద్రవరము. కేవల 'రాజమహేంద్ర' మనియుఁ బ్రయోగించి యుండెను. (భీమ. ప్ర. 32) కాని రాజమహేంద్రి యని యెచ్చటను వాడలేదు.

గ్రామనామములకుఁ జివరఁ గొన్ని Suffixes చేరుచుండును పట్టణము (కృష్ణపట్టణము), పురము (రామచంద్రపురము) నగరము (రాజానగరము), ఊరు (పేరూరు), ప్రోలు (చేబ్రోలు), పాడు (పెంటపాడు), పాలెము (పల్లిపాలెము) మున్నగునవి ఉదాహరణములు

'వర' మనునది కూడ సాధారణముగా సంస్కృత గ్రామనామములకుఁ జివరఁ జేరు Suffix దాని కర్థమును చెప్పఁ జూడ నక్కఱలేదు లేదా 'రాజమహేంద్రవర' మనఁగా రాజమహేంద్రుఁడను రాజుయొక్క వర మనియుఁ జెప్పవచ్చును. ఇట్లే అన్నవరము, పోలవరము, గోకవరము మున్నగు 'వర' మంత మందుఁగల గ్రామనామముల కన్నిటికి అర్థమును సాధింపవచ్చును.

ఈ విధముగా 'రాజమహేంద్రవరము గా శ్రీనాథునికాలమునుండి వ్యవహరింపఁబడిన మన యూరిపే రిట్లే స్థిరపడిన దని చెప్ప వచ్చును.

శ్రీనాథున కించుమించు మూఁడు వందల యేండ్ల తరువాతివాఁడైన అప్పకవి 'రాజమహేంద్రవరము' నే తకార ప్రాసముతోడి కందపద్యమున నిబంధించినాఁడు.

అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమున కాదినారాజమహేం
ద్ర వరంబునఁ జెప్పిన యాం
ధ్ర వచో వ్యాకరణసూత్ర తతిఁ
దెనుఁగింతున్.'

అనునది యీ పద్యము. అప్పకవి చరిత్ర దూరములైన పాగంగధరాది కథ అను కల్పించినమాట వాస్తవము కావచ్చును కాని తనకావ్యమున వాడుకలో నుండకున్న 'రాజమహేంద్రవరము' నేల వాడును? ప్రత్తననాను విషయమున నసత్యకల్పనము చేయవలసిన యక్కఱ యాతని కేమి కలదు?

అప్పటినుండి నేటివరకుఁ బండితుల వాడుకలో 'రాజమహేంద్రవరము' స్థిర పడిపోయినది. మనయూరి విద్వన్మణులైన కందుకూరి, చిలకమర్తి, వడ్డాది, శ్రీపాద, కల్లూరి, మున్నగు మహామహులందఱు వాడినది 'రాజమహేంద్రవర' మే వారే కాదు మన యూరికిఁ జెందని పండితులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు మున్నగు వారు సైతము మన యూరిని ప్రస్తావించి నప్పుడు రాజమహేంద్రవర మనియే ప్రస్తావించి యుండిరి.

ప్రస్తుతము మనయూరివారైన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారును తమ 'ఆంధ్రరచయితలు' లో ఆసంఖ్యాక స్థలము లందును, తమ 'ఆంధ్ర పురాణము' లోఁ జాళుక్యపర్వమున 91 వ పుటలో 13వ పద్యమునను, విద్యానగర పర్వమున 237 వ పుటలోని గద్యమున మైదవ పంక్తిలోను 'రాజమహేంద్రవర' మని ప్రత్యక్షర సత్యముగాఁ బ్రయోగించి యున్నారు. 'రాజమహేంద్రి' యని వారెక్కడను వాడియుండలేదు.

'రాజమహేంద్రి' ని ఏ తెలుఁగు వాఁడును వాడియుండలేదు. కావున నది గ్రాహ్యము కాదు.

'రాజమందిర' మను పేరికిఁ దగిన చారిత్రకాధారములు లేవు. పారస్యతాధారమును కానరాదు. అందుచే నదియుఁ బరిగ్రాహ్యము కాదు.

మొట్టమొదటి పేరయిన 'రాజమహేంద్ర పురము' గాని, తరువాతిదైన

## 27. ఈ పక్షంలో ..

కవిసార్వభౌముని 116 వ జయంతి

18-10-81 ఆదివారం సాయంకాలం 6గం॥లకు శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో ఆస్థానకవి, కవి సార్వభౌమ స్వర్గీయ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి జయంతి సభ జరిగినది

సభకు ప్రసిద్ధ జాతీయవాయకులు శ్రీ ద్రావిడి లింగరాజు గారు అధ్యక్షత వహించిరి

అధ్యక్షులు, శ్రీయుతులు డా. వి కృష్ణమాచార్యులు గారు, శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి, మహోదయులు, శ్రీ పోతుకూచి సూర్యనారాయణ గారు శ్రీ గంధం సీతారామాంజనేయులు గారు శ్రీ పి నరసింహాచారి గారు, శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి గారు మున్నగు ప్రముఖులం కవి సార్వభౌముని జీవిత విశేషములను, వారి రచనల విశిష్టతను వివరించిరి వారి అముద్రిత గ్రంథములను ముద్రింపవలెననీ ప్రస్తుతం స్టాకులో లేనివానిని పునర్ముద్రించాలనీ సూచింప బడినది

---

'రాజమహేంద్రవరము' గాని Suffixes లేకుండ, ఏకదేశమగు 'రాజమహేంద్ర' మనికాని మన యూరికి పేరుండ వగును

వీనిలో శ్రీనాథుఁడు మొదలుగా, అధునాతన కవివరులు శ్రీ మధునాపంతుల వఱకును బహుళ ప్రచారము నందిన, తెలుఁగు వారి నోట బాగుగా నానిన 'రాజమహేంద్రవర' మనునది గ్రాహ్యమని అస్మత్ప్రత్తన నామ పునర్ధరణోద్యము కారులు గ్రహింతురు గాక యని విశ్వసించుచున్నాను.

అట్లు కానిచో, 'రాజమండ్రి' యెట్టిదో 'రాజమహేంద్రి' యు నట్టిదే. రెండును విదేశీయ వ్యవహార కల్పితములే కదా!

— ... —

సుప్రసిద్ధ వ్యాకరణ పండితులు శ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి గారిని కవి సార్వభౌముని గారి పౌత్రులు శ్రీ క. యస్. సత్యనారాయణమూర్తి గారు నూతన వస్త్ర చందనతాంబులాదులతో సత్కరించినారు. ఆదియందు స్వాగతము పలికిన శ్రీ బుగ్గా పాపయ్యశాస్త్రి గారి వందన సమర్పణముతో సభ ముగిసినది.

* * *

### రాజమండ్రి నామచర్చ

రాజమండ్రి పేరు మార్పును గురించి చర్చించే నిమిత్తం రాజమండ్రి హుమారు క్లబ్బు యాజమాన్యమున 18-10-81 తేది సాయంకాలం 5గం॥లకు అల్యూమినియం మర్చంట్సు అసోసియేషను హాలులో సభ జరిగినది విద్వాన్ శ్రీ బులుసు సీతారామ శాస్త్రి గారు సభకు అధ్యక్షత వహించిరి

సభా ప్రారంభమున అధ్యక్షులకు వక్తలకు స్వాగతం చెప్పుచూ క్లబ్బు ప్రధాన కార్యదర్శి డాక్టరు యం. రామకృష్ణా రావుగారు రాజమండ్రి పేరును గురించి పట్టణంలో వివిధ దృక్పథములు కలవనీ ఆయా దృక్పథములను విపులముగా చర్చించుటకు ఈ చర్చావేదిక ఏర్పాటు చేయబడిన దనియు ఆసక్తిగలవారు తమ తమ అభిప్రాయములను సహేతుకముగా ఆవేశకావేశములకు లోనుగాకుండ వివరించ వలసినదనియు కోరిరి.

చర్చలో శ్రీయుతులు వై. యస్. నరసింహారావు శ్రీ డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు, శ్రీ ద్రావిడి లింగ రాజు, శ్రీ పులిపాక కామేశ్వరరావు, శ్రీ కొండేపూడి సుబ్బారావు, శ్రీ గంధం సీతారామాంజనేయులు, శ్రీ పిల్లలమర్రి వెంకటరామయ్య, శ్రీ కంచుమర్తి శ్రీరాములు, శ్రీ సహదేవ సూర్యప్రకాశరావు,

శ్రీ సి. వి. యస్. మహేశ్వర్, శ్రీపోతుకూచి సూర్యనారాయణ, శ్రీ అల్లు భాస్కరరావు, శ్రీ గొడ్డు సింహాచలం, ప్రభృతులు పాల్గొన్నారు

రాజమండ్రి అను పేరును ప్రస్తుతం రాజమహేంద్రిగా మార్చ వలెనని అగి రాజమండ్రి ప్రాచీన నామమే అని శ్రీ వై. యస్. నరసింహారావు మున్నగు కొందఱు తమ అభిప్రాయము తెలిపిరి

రాజమహేంద్రం, రాజమహేంద్ర వరము రాజమహేంద్ర పురము, రాజ మందిరము మున్నగునవి సముచిత నామములని చాలమంది అభిప్రాయపడిరి రాజమండ్రి అను పేరును మార్చవలసిన పని లేదని మఱికొంద అభిప్రాయపడిరి.

వారి వారి అభిప్రాయములను సంగ్రహముగా సమీక్షిస్తూ అధ్యక్షులు శ్రీ సీతారామశాస్త్రి, రాజమహేంద్రి వాదులు చూపిన ఆధారములు ఇంకను పూర్తిగా పరిశీలింప వలసియున్నది వాటి ప్రామాణ్యమును యాథార్థ్యాన్ని నిర్ధారింపవలసియున్నదని అందలి పూర్వాపర విరుద్ధ విషయాలకి సమన్వయ మెట్లో తెలిసికొనవలసియున్నదని తెలిపి రాజమండ్రి శబ్దంలోని ఔచిత్యాన్ని చర్చింపబోవు చుండగా రాజమండ్రి పదాన్ని గురించి ఏం చెప్పినా మేం వినదలచుకోలేదని శ్రీ గంధం సీతారామాంజనేయులు గారు సభనుండి లేచి వెడలిపోయిరి శ్రీ వై. యస్. నరసింహారావు గారు మఱికొందరు వారి ననుసరించిరి సి. వి. యస్. మహేశ్వర్ గారు 'నాకు జనూనుపని ఉన్నది. వెళ్ళుచున్నాను ఏమీ అనుకోవద్దు అనిసభాధ్యక్షులతో చెప్పి వెడలిరి

ఎవరినమ్మకం ఏలాఉన్నా ఎదుటివారు చెప్పేది వినదలచుకో లేదనడంసబబు కాదనీ ఈలాటి విషయం అదరాబాద రాగా ఒకనాటితో తేల్చడం మంచిది కాదనీ ఇంకామాట్లాడదలచిన వారు కల రనీ మరల ఇంకొకచర్చా సమావేశం ఏర్పాటు చేయబడునని చెప్పి అధ్యక్షులు సమావేశం ముగించారు.

మొన్నటి రజతోత్సవం జరపుకొన్న సమాచారం పత్రికకు సంపాదకులూ, షష్టిపూర్తి చేసికొన్న పెద్దలూ అయిన శ్రీ ఆంజనేయులు గారు ' వలంబించిన వైఖరి సమంజసంగా లేదని ఎలువురు భావించినారు.

శ్రీ ఆంజనేయులు గారు మరలవచ్చి మళ్లీసమావేశం ఎప్పుడుఏర్పాటుచేస్తున్నా రని అధ్యక్షులను అడుగగా వారు తేదీ నిర్ణయించి తెలియ జేయబడునని తెలిపిరి

( వి ఎస్ ఎస్ )

* * *

### ప్రముఖ పౌరాణిక ఉపన్యాసకుని సన్మానం

రాజమండ్రి హిందూ సమాజంలో భాగవతసప్తాహం ముగింపు సందర్భంగా జరిగిన సమావేశంలో భాగవతప్రవక్త శ్రీ భాష్యం అప్పలాచార్యులు గారికి ఘనమైన సత్కారము జరగనది. సభకి హిందూ సమాజ అధ్యక్షులు శ్రీ ఎస్ ఎల్ నర సింహారావు అధ్యక్షత వహించిరి ముఖ్య అతిథిగా విచ్చేసిన మాజీ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ వి పార్థసారథి అప్పలాచార్యులు గారిని దుశ్శాలువలతో సత్కరించి అభినందించిరి.

శ్రీ జోనుమద్ది రామలింగ సిద్ధాంతి గారు పట్టువస్త్రము లొసగి సన్మానించిరి.

శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి గారు స్వాగతము పలికిరి. డాక్టరు సి కృష్ణమాచార్యులు వందన సమర్పణము గావించిరి

—•••—

## 28. స్వవిషయము

గతవార్షిక సంచికలో చేసి కొన్న విజ్ఞాపమును పునఃస్మరించుట యే తప్ప ప్రత్యేకముగాఁ జెప్పఁదగిన అంశములు లేవు.

పత్రికా ప్రచురణములో ముఖ్యముగా కేవల సాంస్కృతిక పత్రికా ప్రచురణమున ఎదురయ్యే వివిధములయిన క్లేశముల నధిగమించి సమాలోచన అయిదవసం వత్సరమున నడుగిడినది. లక్ష్య సిద్ధి కనుగుణముగా నెంతవఱకు నడచుచున్నది ? అను విషయమున సహృదయ పాఠకులే ప్రమాణము.

రచయితలు, పాఠకులు మా కొసగుచున్న హృదయపూర్వక సహకారము ఆనందకరముగా నున్నది. వారికి మా కృతజ్ఞతలు. ఆ ప్రోత్సాహమే యూఁతగా ఆర్థికాది - ఇతరఅసౌకర్యముల నధిగమించి అనుచిత రాగద్వేగముల కతీతముగా ప్రగతి పథమున సమాలోచన ముందంజ వేయగల దని సవినయ విజ్ఞప్తి.

సం. పా.

# 29. 'జాతీయ సాంస్కృతిక సమాలోచన'

– శ్రీ దిగవల్లి వేంకటశివరావు, బి.ఏ., బి.యల్.

బ్రహ్మశ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు సంపాదకులుగానున్న సమాలోచన పత్రిక జాతీయ సాంస్కృతిక పత్రిక కదా. అందువల్ల మనజాతి యొక్క చరిత్రకు నీతిధర్మాలకు సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించిన విషయాలే ఈపత్రికలో ప్రకటింపబడతాయి. ఈపత్రికలో వ్యాసాలు రచించే వారిలో చాలమంది మన విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులై పి హెచ్ డి పొందిన విద్యార్థులు

ఇటీవల మన విశ్వవిద్యాలయాలలో ఎం. ఏ పట్టభద్రులై కళాశాలలో అధ్యాపకులుగా నున్నవారలు చరిత్రలేక సాహిత్య విమర్శకు సంబంధించిన పరిశోధన చేసి ఒక సిద్ధాంత వ్యాసమును సమర్పిస్తే వారికి పి హెచ్. డి డాక్టరేటు బిరుదు లభిస్తున్నది. పూర్వకాలమునాటి సంస్కృతాంధ్ర విద్వాంసులకీ సౌకర్యము ఉండేదికాదు. కొంతకాలానికి పండితులకు విద్వాన్ ఉభయభాషా ప్రవీణబిరుదు పరీక్షలు పెట్టారు ఇంగ్లీషురాకపోతే ఎంత గొప్పవిద్వాంసునికైనా డాక్టరేటు బిరుదు లభించేదికాదు. వేదం వెంకటరాయ శాస్త్రిగారంతటి వారికి బి.ఏ కానందువల్ల డాక్టరేటుకు అవకాశములేకపోయినది, ఆఖరికి ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' అనే బిరుదునిచ్చేటప్పటికి కృత్యాద్యవస్థ అయినది. ఇది డాక్టరేట్ బిరుదే సుమండీ అని శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారన్నారు. కాని శ్రీశాస్త్రిగారు తమ పేరుప్రక్క డాక్టర్ అనే బిరుదు వాడలేదు ఇటీవల ఆంధ్రవిశ్వ విద్యాలయం వారు చేసిన సంకల్పంలో ఈ బిరుదు పొందినవారు కళాప్రపూర్ణతోపాటు డాక్టర్ అని తమపేర్ల ముందు ప్రకటించుకొంటున్నారు! ఈడాక్టరేట్ బిరుదులు లేనంత మాత్రాన మన పూర్వకాల విద్వాంసుల గౌరవానికి ఏమైనా కొరత కలిగినదా? వారి అమూల్య రచనలను అందరూ కళ్లకద్దుకొనడం లేదా? ఇలాగ డాక్టరేటు పొందినవారు రచించిన సిద్ధాంతగ్రంథాలు గాని తరువాత వారు రచించే వ్యాసాలు గాని వారి బిరుదుకు వన్నె తెచ్చేవిగా ఉన్నవా? అనే విషయం పాఠక లోకం చెప్పవలసిన సంగతి.

పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా జర్మనీ ఇంగ్లాండు అమెరికాదేశాలలోని విశ్వ విద్యాలయాలలోని విద్వాంసులు ఎప్పుడు ఏపత్రికలో ఏవిషయమునుగూర్చి వ్రాసినా అది వారి విద్వత్తుకు తగిన స్థాయిలోనే వుండేటట్లు వ్రాస్తారు. విమర్శకులు వాటిని చాలా నిశితంగా పరిశీలిస్తారు మనదేశంలోని విద్వాంసులు ఈదృష్టితో వ్రాయరు. కామెలా వ్రాస్తేనేమి తమ్ము విమర్శించేవారెవరు? అనేధీమాతో వ్రాస్తారు. మన విద్యార్థుల లో విమర్శదృష్టి లేకేలేదు. రచనలను గూర్చి విమర్శించే వారే కనబడరు

సమాలోచన పత్రికాధిపతిగారు సరసులు, సౌమ్యులు, సహృదయులు. అందువలన తమ పత్రికకు రచన లంపిన వారి రచనలను సాధారణంగా తిరస్కరించరు, కత్తిరించరు వారి ఔదార్యమును అవకాశంగా చూచుకొని మనరచయితలు కొందరు చాలాదీర్ఘములైన వ్యాసాలు వ్రాస్తున్నారు కొన్ని మూడునాలుగు సంచికల వరకు వ్యాపిస్తున్నవి.

రచనలలో చరిత్రకు సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించినవి తక్కువ సాహిత్యానికి సంబంధించినవే హెచ్చు. పూర్వకవులనుగూర్చి, వారి రచనలను గూర్చి కవిత్వాన్నిగూర్చి కావ్యరీతులను గూర్చిన వ్యాసాలే గాక ఆధునిక కవులను గూర్చి వారిరచనలను గూర్చి చాలా దీర్ఘమైన వ్యాసాలు వ్రాస్తున్నారు. ఒక్కొక్క రచయిత తమ అభిమాన కవిని గూర్చి చాలా అభిమానముతో వ్రాస్తూ వారి రచనలను ప్రశంసిస్తూ అనేక ఉదాహరణలు ఉటంకరించడం జరుగుతూవున్నది.

అయితే ఈవ్యాసాలలో తమ అభిమాన కవినిగూర్చి ఇతరులు చేసిన విమర్శలుగాని ఆకవుల రచనలలోని రస స్వరూపమును శిల్పమును గూర్చి గాని అందులో ఉత్తమ మధ్యమ అధమ భాగములను గూర్చిగాని మంచి చెడ్డలను గూర్చి గాని చర్చించటము లేదు.

రచయితలు ఇంగ్లీషు విమర్శ గ్రంథాలనుండి కొన్ని పంక్తులు ఉల్లేఖిస్తూ వుంటారు. మనకవిత్వ సంప్రదాయములను పాశ్చాత్యకవిత్వ సంప్రదాయములతో పోలుస్తూ వుంటారు దీనికి కారణము వీరు ఇంగ్లీషు విద్యనభ్యసించి యుండుటయే. ఇది ఆవశ్యకమా అనావశ్యకమా అని ఆలోచింపరు. ఈకారణముల వల్లనే వ్యాసము పెరిగిపోతుంది. కాగితము అచ్చు ఖర్చులు విపరీతంగా పెరిగి పోతున్న కాలంలో ఇంతదీర్ఘ వ్యాసాలు ప్రచురించడము పత్రికాధిపతి కెంత కష్టమో ఎవరూ ఆలోచిస్తూవున్నట్లులేదు.

మన సాంస్కృతిక పత్రికలకు వంగ మహారాష్ట్ర తమిళ పత్రికలకు ఈవిషయంలో చాలా తారతమ్య మున్నది. ఆ భాషలలోని పత్రికలలో కేవల సాహిత్య విమర్శలుమాత్రమేగాక మనదేశ చరిత్ర, నీతిమత ధర్మాలు సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించిన విషయ పరిశోధనకుకూడా ప్రాధాన్య మిస్తారు. మన ప్రాచీన చరిత్ర, శాస్త్రవిజ్ఞానము సంస్కృతములోనున్న వాఙ్మయములో నిక్షిప్తమైయున్నది. దానిని గూర్చి

శ్రీ సి. వి. యస్ మహేశ్వర్, శ్రీపోతుకూచి సూర్యనారాయణ, శ్రీ అల్లు భాస్కరరావు, శ్రీ బొడ్డు సింహాచలం, ప్రభృతులు పాల్గొన్నారు

రాజమండ్రి అను పేరును ప్రస్తుతం రాజమహేంద్రిగా మార్చి వేయాలనీ అని రాజమండ్రి ప్రాచీన నామమే అనీ శ్రీ వై. యస్ నరసింహారావు మున్నగు కొందరు తమ అభిప్రాయము తెలిపిరి

రాజమహేంద్రం, రాజమహేంద్ర వరము రాజమహేంద్ర పురము, రాజమందిరము మున్నగునవి సముచిత నామములని చాలమంది అభిప్రాయపడిరి రాజమండ్రి అను పేరును మార్చవలసిన పని లేదని మరికొంద అభిప్రాయపడిరి.

వారి వారి అభిప్రాయములను సంగ్రహముగా సమీక్షిస్తూ అధ్యక్షులు శ్రీ సీతారామశాస్త్రి రాజమహేంద్రి వాదులు చూపిన ఆధారములు ఇంకను పూర్తిగా పరిశీలింప వలసియున్నది వాటి ప్రామాణ్యమును యాథార్థ్యాన్ని నిర్ధారింపవలసియున్నదని అందలి పూర్వాపర విరుద్ధ విషయాలకి సమన్వయ మెట్లో తెలిసికోవలసియున్నదనీ తెలిపి రాజమండ్రి శబ్దంలోని ఔచిత్యాన్ని చర్చింపబోవు చుండగా రాజమండ్రి పదాన్ని గురించి ఏం చెప్పినా మేం వినదలచుకో లేదని శ్రీ గంథం సీతారామాంజనేయులు గారు సభనుండి లేచి వెడలిపోయిరి శ్రీ వై. యస్ నరసింహారావు గారు మరికొందరు వారి ననుసరించిరి సి వి. యస్ మహేశ్వర్ గారు 'నాకు జరూరుపని ఉన్నది. వెళ్ళుచున్నాను ఏమీ అనుకోవద్దు అనిసభాధ్యక్షులతో చెప్పి వెడలిరి.

ఎవరివమ్మకం ఏలాఉన్నా ఎదుటివారు చెప్పేది వినదలచుకో లేదనడంసబబు కాదనీ ఈలాటి విషయం అదరాబాదరాగా ఒకనాటితో తేల్చడం మంచిది కాదనీ ఇంకామాట్లాడదలచిన వారు కలరనీ మరల ఇంకొకచర్చా సమావేశం ఏర్పాటు చేయబడుననీ చెప్పి అధ్యక్షులు సమావేశం ముగించారు.

మొన్ననే రజతోత్సవం జరపుకొన్న సమాచారం పత్రిక సంపాదకులూ, షష్టిపూర్తి చేసికొన్న పెద్దలూ అయిన శ్రీ ఆంజనేయులు గారు ఇవలంబించిన వైఖరి సమంజసంగా లేదని పలువురు భావించినారు

శ్రీ ఆంజనేయులు గారు మరలవచ్చి మళ్లీసమావేశం ఎప్పుడుఏర్పాటుచేస్తున్నారని అధ్యక్షులను అడుగగా వారు తేదీ నిర్ణయించి తెలియ జేయబడునని తెలిపిరి

( వి ఎస్. ఎన్ )

* * *

ప్రముఖ పౌరాణిక
ఉపన్యాసకుని సన్మానం

రాజమండ్రి హిందూ సమాజంలో భాగవతసప్తాహం ముగింపు సందర్భంగా జరిగిన సమావేశంలో భాగవతప్రవక్త శ్రీ భాష్యం అప్పలాచార్యులు గారికి ఘనమైన సత్కారము జరిగినది సభకి హిందూ సమాజ అధిపతులు శ్రీ ఎస్ ఎల్ నరసింహారావు అధ్యక్షత వహించిరి. ముఖ్య అతిథిగా విచ్చేసిన మాజీ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ వి పార్థసారథి అప్పలాచార్యులు గారిని దుశ్శాలువలతో సత్కరించి అభినందించిరి

శ్రీ జోనుమద్ది రామలింగ సిద్ధాంతి గారు పట్టువస్త్రము లొసగి సన్మానించిరి.

శ్రీ సత్యవోలు వరప్రసాదమూర్తి గారు స్వాగతము పలికిరి డాక్టరు సి. కృష్ణమాచార్యులు వందన సమర్పణము గావించిరి.

—...—

## 28. స్వ విష యము

గతవార్షిక సంచికలో చేసికొన్న విజ్ఞాపనము పునఃస్మరించుటయే తప్ప ప్రత్యేకముగాఁ జెప్పఁదగిన అంశములు లేవు.

పత్రికా ప్రచురణములో ముఖ్యముగా కేవల సాంస్కృతిక పత్రికాప్రచురణమున ఎదురయ్యే వివిధములయిన క్లేశముల నధిగమించి సమాలోచన అయిదవసంవత్సరమున నడుగిడినది. లక్ష్యసిద్ధి కనుగుణముగా నెంతవఱకు నడచుచున్నది ? అను విషయమున సహృదయ పాఠకులే ప్రమాణము.

రచయితలు, పాఠకులు మాకొసగుచున్న హృదయపూర్వక సహకారము ఆనందకరముగా నున్నది. వారికి మా కృతజ్ఞతలు. ఆ ప్రోత్సాహమే యూఁతగా ఆర్థికాది – ఇతరఅసౌకర్యముల నధిగమించి అనుచిత రాగద్వేగముల కతీతముగా ప్రగతి పథమున సమాలోచన ముందంజ వేయగలదని సవినయ విజ్ఞప్తి.

సం. పా.

## 29. 'జాతీయ సాంస్కృతిక సమాలోచన'

- శ్రీ దిగవల్లి వేంకటశివరావు, బి.ఏ., బి.యల్.

బ్రహ్మశ్రీ విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు సంపాదకులుగానున్న సమాలోచన పత్రిక జాతీయ సాంస్కృతిక పత్రిక కదా. అందువల్ల మనజాతి యొక్క చరిత్రను నీతిధర్మాలను సంస్కృతి సంప్రదాయాలను సంబంధించిన విషయాలే ఈపత్రికలో ప్రకటింపబడతాయి ఈపత్రికలో వ్యాసాలు రచించే వారిలో చాలమంది మన విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులై పి.హెచ్.డి. పొందిన విద్యాధికులు.

ఇటీవల మన విశ్వవిద్యాలయాలలో ఎం. ఏ పట్టభద్రులై కళాశాలలో అధ్యాపకులుగా నున్నవారలు చరిత్రలేక సాహిత్య విమర్శను సంబంధించిన పరిశోధన చేసి ఒక సిద్ధాంత వ్యాసమును సమర్పిస్తే వారికి పి హెచ్. డి డాక్టరేటు బిరుదు లభిస్తున్నది. పూర్వకాలమునాటి సంస్కృతాంధ్ర విద్వాంసులకీ సౌకర్యము ఉండేదికాదు. కొంతకాలానికి పండితులకు విద్వాన్ ఉభయభాషా ప్రవీణబిరుదు పరీక్షలు పెట్టారు ఇంగ్లీషురాకపోతే ఎంత గొప్పవిద్వాంసునికైనా డాక్టరేటు బిరుదు లభించేదికాదు వేదం వెంకటరాయ శాస్త్రిగారంతటి వారికి బి.ఏ. కానందువల్ల డాక్టరేటుకు అవకాశములేకపోయినది, ఆఖరికి ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' అనే బిరుదునిచ్చేటప్పటికి కృతార్థ్యావస్థ అయినది. ఇది డాక్టరేట్ బిరుదే సుమండీ అని శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారన్నారు. కాని శ్రీశాస్త్రిగారు తమ పేరుప్రక్క డాక్టరనే బిరుదు వాడలేదు ఇటీవల ఆంధ్రవిశ్వ విద్యాలయం వారు చేసిన సంతర్పణలలో ఈ బిరుదు పొందినవారు కళాప్రపూర్ణతోపాటు డాక్టర్ అని తమపేర్ల ముందు ప్రకటించుకొంటున్నారు! ఈడాక్టరేట్ బిరుదులు లేనంత మాత్రాన మన పూర్వకాల విద్వాంసుల గౌరవానికి ఏమైనా కొరత కలిగినదా? వారి అమూల్య రచనలను అందరూ కళ్లకద్దుకొనడం లేదా? ఇలాగ డాక్టరేటు పొందినవారు రచించిన సిద్ధాంతగ్రంథాలు గాని తరువాత వారు రచించే వ్యాసాలు గాని వారి బిరుదుకు వన్నెతెచ్చేవిగా ఉన్నవా? అనే విషయం పాఠక లోకం చెప్పవలసిన సంగతి.

పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా జర్మనీ ఇగ్లాండు అమెరికాదేశాలలోని విశ్వ విద్యాలయాలలోని విద్వాంసులు ఎప్పుడు ఏపత్రికలో ఏవిషయమునుగూర్చి వ్రాసినా అది వారి విద్వత్తుకు తగిన స్థాయిలోనే వుండేటట్లు వ్రాస్తారు. విమర్శకులు వాటినిచాలా నిశితంగా పరిశీలిస్తారు మనదేశంలోని విద్వాంసులు ఈదృష్టిలో వ్రాయరు తామెలా వ్రాస్తేనేమి తమ్ము విమర్శించేవారెవరు? అనేధీమాలో వ్రాస్తారు. మన విద్యాధికుల లో విమర్శదృష్టి లేనేలేదు. రచనలను గూర్చి విమర్శించే వారే కనబడరు

సమాలోచన పత్రికాధిపతిగారు సరసులు, సౌమ్యులు, సహృదయులు అందువలన తమ పత్రికకు రచన లంపిన వారి రచనలను సాధారణంగా తిరస్కరింపరు, కత్తిరించరు వారి ఔదార్యమును అవకాశంగా చూచుకొని మనరచయితలు కొందరు చాలాదీర్ఘములైన వ్యాసాలు వ్రాస్తున్నారు కొన్ని మూడునాలుగు సంచికల వరకు వ్యాపిస్తున్నవి.

రచనలలో చరిత్రను సంస్కృతి సంప్రదాయాలను సంబంధించినవి తక్కువ సాహిత్యానికి సంబంధించినవే హెచ్చు. పూర్వకవులనుగూర్చి, వారి రచనలను గూర్చి కవిత్వాన్నిగూర్చి కావ్యరీతులను గూర్చిన వ్యాసాలే గాక ఆధునిక కవులను గూర్చి వారిరచనలను గూర్చి చాలా దీర్ఘమైన వ్యాసాలు వ్రాస్తున్నారు. ఒక్కొక్క రచయిత తమ అభిమాన కవిని గూర్చి చాలా అభిమానముతో వ్రాస్తూ వారి రచనలను ప్రశంసిస్తూ అనేక ఉదాహరణలు ఉటంకించడం జరుగుతూవున్నది.

అయితే ఈవ్యాసాలలో తమ అభిమాన కవినిగూర్చి ఇతరులు చేసిన విమర్శలుగాని ఆకవుల రచనలలోని రస స్వరూపమును శిల్పమును గూర్చి గాని అందులో ఉత్తమ మధ్యమ అధమ భాగములను గూర్చిగాని మంచి చెడ్డలను గూర్చి గాని చర్చించడము లేదు.

రచయితలు ఇంగ్లీషు విమర్శ గ్రంథాలనుండి కొన్ని పంక్తులు ఉల్లేఖిస్తూ వుంటారు. మనకవిత్వ సంప్రదాయములను పాశ్చాత్యకవిత్వ సంప్రదాయములతో పోలుస్తూ వుంటారు దీనికి కారణము వీరు ఇంగ్లీషు విద్యనభ్యసించి యుండుటయే. ఇది అవశ్యకమా అనావశ్యకమా అని ఆలోచింపరు ఈకారణముల వల్లనే వ్యాసము పెరిగిపోతుంది కాగితము అచ్చు ఖర్చులు విపరీతంగా పెరిగి పోతున్న కాలంలో ఇంతదీర్ఘ వ్యాసాలు ప్రచురించడము పత్రికాధిపతి కెంత కష్టమో ఎవరూ ఆలోచిస్తూవున్నట్లులేదు.

మన సాంస్కృతిక పత్రికలకు వంగ మహారాష్ట్ర తమిళ పత్రికలకు ఈవిషయంలో చాలా తారతమ్య మున్నది. ఆ భాషలలోని పత్రికలలో కేవల సాహిత్య విమర్శలుమాత్రమేగాక మనదేశ చరిత్ర, నీతిమత ధర్మాలు సంస్కృతి సంప్రదాయాలకు సంబంధించిన విషయ పరిశోధనకూడా ప్రాధాన్య మిస్తారు. మన ప్రాచీన చరిత్ర, శాస్త్రవిజ్ఞానము సంస్కృతములోనున్న వాఙ్మయములో నిబిడీకృతమైయున్నది. దానిని గూర్చి

పరిశోధించి దేశభాషలలో వ్రాయవలసిన బాధ్యత ఉభయభాషలు తెలిసిన విద్వాంసుల యందున్నది ఈదృష్టితో వంగ, మహారాష్ట్ర, తమిళ విద్వాంసులు పరిశోధక వ్యాసాలు వ్రాస్తున్నారు. పాశ్చాత్య విద్వాంసులు కూడా ఈదృష్టితో పరిశోధనలు చేస్తూ అనేక గ్రంథాలు, వ్యాసాలు వ్రాస్తున్నారు. అదేకాక విశ్వవిద్యాలయాలు ఈపరిశోధనలను ప్రోత్సహిస్తున్నవి తెలుగుదేశంలో ఇలాగ జరగడం లేదు

పూర్వము మన పండితులు కొందరు వేదశాస్త్ర పురాణాలను తెలుగులో వ్రాసారు ఆనంద గజపతి మహారాజు మన శాస్త్ర గ్రంథాలను తెలుగులో వ్రాయించారు ఇటీవల శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు వాత్స్యాయనుని కామసూత్రాలను గౌతమధర్మ సూత్రాలను తెలుగులోకి అనువదించారు ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి వానిని ప్రకటించారు సంస్కృత వాఙ్మయము లోని అపూర్వ విషయాలను మన డాక్టరేట్ విద్యార్థులు పరిశోధించి మనదేశ చరిత్రను నీతిధర్మాలను సంస్కృతి సంప్రదాయాలను సంబంధించిన వ్యాసాలు వ్రాయవచ్చును కదా?

నిజానికి ఈసమయంలో మనదేశములో తలయెత్తిన అనేక సమస్యలను పరిష్కరించుకొనుటకు మన ప్రాచీన శాస్త్రగ్రంథాలు తోడ్పడగలవు

ఉదాహరణమునకు కుల భేదములను గూర్చి కులాధిక్యమును గూర్చి ఆలోచించడానికి కమలాకర భట్టు రచించిన శూద్ర కమలాకరము తోడ్పడ గలదు దానిని ఆనందగజపతిగారు తెలుగు చేయించియున్నారు

కలియుగములో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ఉండరని, అందరూ శూద్ర సములేయని మత్స్య పురాణ వచనమును కమలాకర భట్టు ఉటంకించి చర్చించియున్నాడు. నిజానికి ప్రస్తుతము బ్రాహ్మణులని చెప్పేవారు శూద్ర బ్రాహ్మణులు అలాగే క్షత్రియులు, వైశ్యులు, శూద్ర సములే ఇది శూద్రయుగము దీనిని పురస్కరించుకొని ఎన్నో విషయాలు చర్చించ వలసి యున్నది

ఇటీవల తమిళనాడులోని మీనాక్షి పురములో చాలా హరిజన కుటుంబాల వారు మహమ్మదీయమతంలో కలియగా హిందూజనసంఘములో అలజడి కలిగినది కాని మళ్లీ హిందూ సంఘములో కలుపుకొనే విషయమై తర్జన భర్జనలు జరుగుతున్నవి చాలా కాలమునుండి ఆర్యసమాజము వారు శుద్ధి ఉద్యమమును నడుపుతూ మహమ్మదీయులైన హిందువులను క్రైస్తవులైనవారిని హిందూసంఘములో కలుపుతున్నారు దీనికి మన శాస్త్రములలో ఆధారమున్నదా అని కొందరు ప్రశ్నించారు ఉన్నది వ్రాత్యస్తోమమనే వైదిక కర్మ జరిపితే అలాచేయవచ్చును

వ్రాత్యస్తోమము యొక్క కర్మకాండ కాత్యాయన శ్రౌత సూత్రముల కర్కభాష్యము XX II 47 లో చెప్పబడినది మూడుతరముల క్రిందటి (100 సంవత్సరముల క్రిందట) వర్ణభ్రష్టులైన వారిని ఆనార్యజాతుల వారైన మల్లులు ఝాల్లికులు, అభీరులు, నాటధన్యులు, కరూషులు లిచ్ఛవీలులో నిషాదులు కూడా వ్రాత్యస్తోమముద్వారా హిందూ సంఘములోని కులాలలో కలిసిపోయారని చరిత్ర చెప్పుతున్నది

ఇక మన కులవ్యవస్థను గూర్చి విమర్శించేవారు ఇతరకులాల వారిని బ్రాహ్మణులు అణగద్రొక్కారని ఇతరకులాల వారెవ్వరు బ్రాహ్మణులుగా మారడానికి వీలు లేకుండా చేసారని నిందిస్తూ వుంటారు బ్రాహ్మణులు కొన్ని అన్యాయాలు చేసి యుండవచ్చును గాని ఆనాటి రాజుల తోడ్పాటు లేకుండా అలాంటి అన్యాయాలు జరగటానికి వీలు లేదు గదా! ఈ సంగతిని మనవిమర్శకులు గమనింపరు.

ఇంతవరకు ధర్మశాస్త్రాలేమి చెప్పుతున్నవో పరిశోధించి చెప్పేవారు కరవైనారు ధర్మశాస్త్రాలలో అనులోమ ప్రతిలోమ వివాహాలను గురించి అనేక విధి నిషేధాలున్నవి అనులోమ సంతానానికి కర్మాధికారము దాయాది హక్కులు ఉన్నవి అనులోమ వివాహములలో క్రింది కులాల వారు పైకులముగా మారడానికి గల అవకాశము ధర్మశాస్త్రములలో చెప్పబడియున్నది

మనుస్మృతి 10 అధ్యాయము 64, 65 శ్లోకాలు చూస్తే తెలుస్తుంది ఒక బ్రాహ్మణుడు తక్కువ కులాల స్త్రీలను పెండ్లాడవచ్చు ననే విధియున్నది కదా ఒక బ్రాహ్మణుడు పెండ్లాడిన శూద్రస్త్రీకి పుట్టిన కొమార్తెను మళ్లీ ఒక బ్రాహ్మణుడే పెండ్లాడగా మళ్లీ అలాగే జన్మించిన స్త్రీని మళ్లీ ఇంకొక బ్రాహ్మణుడు పెండ్లాడగా ఏడవతరములో స్త్రీకి పుట్టిన సంతానము బ్రాహ్మణు డగుదు రనియును ధర్మశాస్త్రములో ఉదహరింపబడినది!

ఇలాగే గౌతమ ధర్మసూత్రములలో 172 వ సూత్రములో వర్ణాంతర ప్రాప్తిని గూర్చిన నిబంధన మున్నది 'సవర్ణాదులగు అనులోమ జాతులకు ఉత్కర్షముగా తండ్రిద్వారా ఏడు తరములకు అపకర్షముగా తల్లిద్వారా ఐదు తరములకును వర్ణాంతర ప్రాప్తి కాగల దని సూత్రార్థమని శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులు గారు వ్రాసియున్నారు దీని వివరణములో తక్కువ వర్ణమువారు బ్రాహ్మణు లగుదు రని వ్రాసినారు !!

మనధర్మశాస్త్రములను పరిశోధించుట ఎంత అవసరమో దీనివల్ల తెలుస్తుంది.

)o(

రై కన్పించుచున్నవి, సంస్కృత వాఙ్మయములోని ప్రధాన ఘట్టములు కొన్ని రైన పట్టిక వని మన మానందింపవలెను ఇట్టివి మరొక రెండుకూడు గ్రంథములు వెలువరించినచో సుధాలహరి దాదాపుగ సాధితార్థము కావచ్చును సంస్కృత సాహిత్య సుధాలహరిని ఒకే గ్రంథమున వెలువరించుట కష్టముగదా దిఙ్మాత్రము గనైన దానిని సాధించినవారు శ్రీ ఆచార్యులుగారు

ఈ గ్రంథము సుమారు 16 పుటలతో, విదేశీయ విశ్వవిద్యాలయ ప్రాచార్య ప్రశంసలతో దేశీయ పాశ్చాత్య ప్రశంసలతో రచయిత్రిగారి నివేదనముతో చక్కని ముద్రణలో మంచి పరుతో మనోనేత్రముల కాకర్షకముగా నున్నదనుటలో సందేహము లేదు

ఈ గ్రంథమున 1 పండితరాజస్య ప్రతిభా వైభవమ్ 2 సంగీత సుధ సాహిత్యము 3. వాణీం భజత వైయ్యాకరణీమ్ 4 కర్తవ్యమేవ కర్తవ్యం 5 కాసాం వ్యంగ్యం ప్రథమో గిరాము 6 వలపకే పరిచయః 7 కాళిదాస మహోదయః 8 యతిపతే రంగనాథం, 9 ఆదికవి రాదికావ్యం చ 10 ద్వ్యం కవీనాం నికషం వదంతి 11 కవికుల గురుః కాళిదాసః 12 మహాకవి రఘుః అను విషయములు పండ్రెండు కలవు శ్రీ ఆచార్యులవారు సాధ్యమైనంత జాగ్రత్తగా మృదుమధురమగు శైలితో చక్కని శబ్దార్థసంపదతో వీనిని నిర్వహించి రచనచేసిరి పండ్రెండు విషయములుగల 160 పుటల సంస్కృతగ్రంథమును చక్కని ముద్రణలో పండ్రెండు రూపాయలకే పాఠకుల కందించుట విషయపరిజ్ఞానము కలవారికి సముచిత మనిపించును జిజ్ఞాసువులకు విద్యార్థులకు మరికొంత ధరను తగ్గించియిచ్చుటకు సంసిద్ధులైన శ్రీ ఆచార్యులవారి యౌదార్యము మనము తప్పక వినియోగించుకోదగియున్నది ఈ గ్రంథము గ్రంథాలయములలో, కళాశాలా గ్రంథాలయములలో నుంచదగి యుండుటయేకాక, సంస్కృత విద్యార్థులకు పాఠ్యముగా నుంచదగిన దనుటలో సందేహము లేదు కనీసము సహృదయులగు వాంధ్రులైనను దీనిని కొని రచయితను ప్రోత్సహించుట మంచిది శ్రీ ఆచార్యులవారు తమకృషిని సర్వసమగ్రముగ సాగించి సుధాలహరిని సమగ్రము గావింటయేకాక మరిన్ని గ్రంథములను రచించి సహృదయ పాఠకుల నానందపరచి భాషా సేవతో చరితార్థత నందుదురుగాక

సాధు

* * *

## మహాక్షేత్రము మామిళ్లపల్లి

[గ్రంథకర్త శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు. వెల 6 రూ. ప్రతులకు - చైర్మన్ శ్రీలక్ష్మీనరసింహస్వామి వారి దేవస్థానం ట్రస్టుబోర్డు మామిళ్ళపల్లి, అచ్చంపేట తాలూకా మహబూబ్ నగర్ జిల్లా, వయా, తెల్కపల్లి]

మామిళ్ళపల్లి మహబూబునగర్ జిల్లాలో ప్రసిద్ధమైన పురాతన క్షేత్రము ఇందలి స్వామి యుగ్రనరసింహుడైనను సౌమ్యమూర్తి 12 వ శతాబ్దిలో తెలుగు చోడుల కాలమున మహోదశ ననుభవించి నట్లుగా శాసనాదుల వలన స్పష్టమగుచున్నది అట్టి పురాతన నృసింహాలయమును దాని పరిసరములలోని ఆలయములను వానిచరిత్రలను పరిశీలించి రచింపబడిన గ్రంథము 'మహాక్షేత్రము మామిళ్ళపల్లి' ఈ చరిత్రను రచించిన వారు శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు వీరు ప్రసిద్ధ కవులు, రచయితలు ఇట్టివీరు పై ఆలయ ధర్మకర్తృత్వమండలివారిచే ప్రార్థితులై యీ ఆలయ చరిత్రను, అందలి శిల్ప సంపదను, ప్రాచీనశాసనములను గూర్చి చక్కని శైలిలో రచించిరి ఈ గ్రంథమువలన వచ్చిన సొమ్ముతో జీర్ణదేవాలయోద్ధరణ గావింపవలెనను సంకల్పము ప్రశంసనీయము నేడు మనదేశములోని దేవాలయముల పరిదీనస్థితి, వ్యక్తులపై ఆస్తికులు బాధపడవలసిన స్థితి గనుపించుచున్నది మనధర్మ రక్షణకు, దేవాలయోద్ధరణ (క్రొత్తవి కట్టించకపోయినా పరవాలేదు) అయినా ముఖ్యకర్తవ్యం అని మనమందర మంగీకరింపవలసిన విషయము 60 పేజీల యీపుస్తకంలో యీఆలయాన్ని గురించి పరిసరాలయాల్ని గూర్చి (తగినంతగా) వివరంగ చూపేకాక ఆలయముల దాని నిర్మాణము, అర్చామూర్తులు - మున్నగువిషయము లెన్నియో వివరింపబడినవి ఇందలి శాసనములు ప్రాచీన శాసనాలు కూడా యిందు ఉదాహరింపబడినవి ఇది యొక మంచిపుస్తకం గ్రంథమూల్య మాలయోద్ధరణమున వినియోగింపబడినది కావున ఆస్తికు లధికముగ భావించి కొనవచ్చును

—శ్రీ గౌతమ

— —

## 31. దీపావళి

'అభినవ రామకృష్ణ'
శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి

ధరలన్నియును నేడు తారాపథంబంట
 అవ్వాయి లను తారచువ్వలేల?
చెప్పునాయకులంద చిటపట లుండంగ
 వైకొను సీమటపాకు లేల?
మానవత్వము రూపుమాపు దానవు లుండ
 డంబైన యాటము బాంబులేల?
ఘనవాయకా... ద్గారంబు లవి యుండ
 గడక 'తు' స్సు టపాకాయ లేల?
తలచు పార్టీ లమార్పిడి జరుగుచుండ
వంతకులకు నీకప్పగింపు లేల?
ఎంచి చూడంగ నీ బాణసంచు చాలు,
లేదు దీపావళికి గత్తు లేదు మనకు?

* *

